# బ్రాహ్మణ - గోవు

(బ్రహ్మగవి సూక్తము - అథర్వ - 5 కాం)


వ్యాఖ్యాత

స్వా. అభయదేవశర్మ

అనుకర్త.

'కళాప్రపూర్ణ' పండిత గోపదేవ్ (దార్శనిక్)



ఆర్యసమాజము - కూచిపూడి

1987

'అంబా' దర్శన గ్రంథమాల - 54
ప్రథమ ముద్రణము - ౧౦౦౦

ప్రభవ - చైత్రము
ఏప్రిల్ - 1987 - వి. శ. ౨౦౪౪

వెల : రు. 4-50

ప్రతులకు :
ఆర్యసమాజము - కూచిపూడి
తెనాలితాలూకా - గుంటూరుజిల్లా
పిన్ 522 313



ముద్రణ : విజయ ఆర్టు ప్రెస్, తెనాలి.

# అంబాదర్శన గ్రంథమాల

మహారాజ పోషకులు :

| | | |
|---|---|---|
| 1 | శ్రీమతి కొత్తపల్లి యామినీదేవి | కూచిపూడి |
| 2 | శ్రీ బెల్దె జగదీశ్వరయ్య శ్రేష్ఠి | సికిందరాబాదు |
| 3 | శ్రీ మాశెట్టి వేంకటేశ్వరరావు | ,, |
| 4 | శ్రీ కె. మాధవయ్య | నిడుబ్రోలు |
| 5 | శ్రీ వై. వి. సుబ్బారావు, సరోజనీదేవి | గుంటూరు |
| 6 | శ్రీ గ్రంధి కామరాజు | విజయవాడ |
| 7 | శ్రీ కావూరి జయచంద్రవర్మ | కూచిపూడి |
| 8 | శ్రీ చదలవాడ అచ్చేశ్వరరావు, రాజ్యలక్ష్మి | కూచిపూడి |
| 9 | శ్రీమతి చదలవాడ లక్ష్మమ్మ | ,, |
| 10 | శ్రీ మట్టెడ్డి గురవారెడ్డి | తూములూరు |
| 11 | శ్రీ చంద్రయ్య అండ్ సన్సు-అలవాల | సికిందరాబాదు |
| 12 | శ్రీ యం. యన్. బాలకృష్ణ, సుధాకర్ | ,, |
| 13 | శ్రీ ఉప్పల రాజేశ్వరరావు | ,, |
| 14 | శ్రీ కొసరాజు తిరుమలరావు, సూర్యకుమారి | కురుమద్దాలి |
| 15 | శ్రీ గట్టె సుబ్బారావుగుప్త, నాంచారమ్మ | గుంటూరు |
| 16 | శ్రీ జక్కిడిసీతారామిరెడ్డి-సీతాఫలమండి | సికిందరాబాదు |
| 17 | శ్రీ తుమ్మల వల్లభయ్య | కూచిపూడి |
| 18 | శ్రీ నోముల స్వామిదాసు,<br>శ్రీ శ్రీపతి వెంకటరావు | సికిందరాబాదు |
| 19 | శ్రీ వాసంశెట్టి రామకృష్ణారావు | వలసపాకల |
| 20 | శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ | గుంటూరు |

రాజ పోషకులు :

| | | |
|---|---|---|
| 1 | శ్రీ కావూరి సంగయ్య | కూచిపూడి |
| 2 | శ్రీ జె. వెంకట్రావు | వరంగల్ |
| 3 | శ్రీ బి. శంకరలాల్ | హైదరాబాదు |
| 4 | శ్రీ యలవర్తి రామకోటయ్య, సీతారత్నం | కూచిపూడి |
| 5 | శ్రీ కుమ్మరి పోచయ్య | సికిందరాబాదు |
| 6 | శ్రీమతి బొట్టా వేంకటరత్నమ్మ | కూచిపూడి |
| 7 | శ్రీ యం. భూపతిరావు, ప్రజ్ఞాపురం | హైదరాబాదు |
| 8 | శ్రీ పరిదె శ్రీనివాసరావు, కనకలక్ష్మి-రేలంగి | గోదావరిజిల్లా |
| 9 | శ్రీ వి. యస్. గుప్త | కొత్తగూడెం |

పోషకులు :

| | | |
|---|---|---|
| 1 | శ్రీ మేకా రామకృష్ణయ్య | కూచిపూడి |
| 2 | శ్రీ జాస్తి వేంకటప్పయ్య, తులశమ్మ | ,, |
| 3 | శ్రీమతి దాసరి రామకోటమ్మ | కూచిపూడి |
| 4 | శ్రీమతి కన్నెగంటి శైలసుత నవరత్నకుమారి | ,, |
| 5 | శ్రీ కోట్ల రమణారెడ్డి | సికిందరాబాదు |
| 6 | శ్రీ పోలం వీరయ్య సోదరులు | ,, |
| 7 | శ్రీ కోడూరి సుబ్బారావు-సీతా ఫలమండి | ,, |
| 8 | శ్రీ దుర్గా సత్యనారాయణ, కృష్ణవేణి | తణుకు |
| 9 | శ్రీ కావూరి శివరామయ్య | మోపిదేవి |
| 10 | శ్రీ గడ్డిపాటి వేంకటకృష్ణయ్య | అమృతలూరు |
| 11 | శ్రీ చుండూరు శ్రీహరిరావు, శాంతకుమారి | గుంటూరు |

# విషయసూచిక

# సంపాదకీయము

మా అంబాదర్శన గ్రంథమాల తరఫున 53 పుస్తకములు ప్రచురించితిమి. వీనినన్నింటిని దాదాపు కళాప్రపూర్ణ పండిత గోపదేవ్‌శాస్త్రిగారే రచించిరి. ఈమధ్య నొక సందర్భమున శాస్త్రి గారూ! గ్రంథమాలతరఫున ప్రచురించుటకు మీదగ్గఱ నేవైన నముద్రితగ్రంథములు యుష్మద్రచితములు కలవాయని యడుగగా నాలుగో మూడో వ్రాతప్రతిగ్రంథముల నిచ్చిరి. అందులో నీ బ్రహ్మగవిసూక్తమొకటి.

ఈ సూక్తములోని విశిష్టతను, అందలి గోవు, బ్రాహ్మణ, అదన, వైతహవ్యమను నాలుగు శబ్దముల వైదికలౌకికార్థము లనుగుణించి ప్రారంభిక వివేచనలో గ్రంథకర్త విపులముగా వివరించిరి. కావున వానినిగూర్చి వివరించుట నాపనిగాదు. పాఠకులకు గ్రంథపరిచయము కలిగించుటకొఱకే కొన్నిపరి చయవాక్యములు ఆవశ్యకములగును. గ్రంథస్థవిషయమును ఉపోద్ఘాతములో వివరించినచో కొంతమంది పాఠకులు ఆ యుపోద్ఘాతముతోడనే తృప్తినంది గ్రంథము పఠింపరు. ఆ ప్రమాదమునుండి తప్పుకొనుటకు ఉపోద్ఘాతము పరిమిత ముగా నుండవలయును.

ఈ గ్రంథస్థపరిచయవాక్యము లట్టివి కావు. ఈ ప్రారంభిక వివేచనలో 1 గోవు 2 బ్రాహ్మణ 3 అదన 4 వైతహవ్య శబ్దముల వివరణము లేకున్నచో గ్రంథము పఠించువారు అయోమయస్థితిలో పడుదురు. అట్టి ప్రమాదమునుండి పాఠకులను రక్షించుటకొఱకే యీయుపోద్ఘాతము పెద్దదిగానున్నది. కావున పాఠకులు ఈప్రారంభిక వివేచన'ను ఆమూలాగ్రము చదివి దాని సాయమున ఈ బ్రహ్మగవిసూక్తమును పఠించి యుపయోగమును పొందుదురుగాక !

—వెంకయార్య.



# విజ్ఞప్తి

నేను ఇంతకు పూర్వము సంస్కృతభాషలోనున్న దర్శనములైదు ఉపనిషత్తులు పదునొకండు తెలుగువ్యాఖ్యలతో నలంకరించి తెలుగుపాఠకుల కందించియుంటిని. ఇంకను కొన్ని యితరపుస్తకములు ముప్పదియైదుకు తక్కువకాకుండ వ్రాసితెలుగుసాహిత్యమునకు సేవచేసియున్నాడ. ఇవియన్నియు తెలుగు సాహిత్యమున నొక విశేషస్థానము నాక్రమింపవలెనని యుద్దేశించితిని. నా రచనలన్నియు విశేషముగ నాధ్యాత్మిక విషయములకు సంబంధించినవి. అవియు నొక్కచేతితో వ్రాసినవి. దర్శనములు 5 కాని, ఉపనిషత్తులు 11 కాని నాకు పూర్వ మేయొక్కరు వ్యాఖ్యలతో తెలుగు పాఠకుల కందించిన వారు లేరని నేననుకొనుచున్నాను. అది యెంతవఱకుసత్యమో నాకు తెలియదు-పాఠకులే నిర్ణయింతురు.

శ్రీమద్దయానందమహర్షి వ్రాసిన ఋగ్వేదాదిభాష్యభూమికను అనువదించి తెలుగులోకమున కందించియున్నాను. తెలుగుసాహిత్యమున నిదియు అపూర్వగ్రంథమనక తప్పదు. తదుపరి వేదములందలి కొన్నిసూక్తములను అర్థతాత్పర్యములతో, వివరణతో తెలుగుచదువరుల కరకమలములం దుంచవలెనను కోరికతో 'ఆర్యాభివినయము' పేర నొకవందమంత్రములను శ్రీదయానందమహర్షి భాష్యోపేతములను తెలుగు చేసితిని. మఱియు వైదికవినతి అనుగ్రంథమును రోజుకొకటి

నొప్పున 4 మాసములకు సరిపడు మంత్రములకు వ్యాఖ్య తెనిగించితిని. అవియన్నియు భక్తిప్రపూరితములు. భక్తులు భక్తవత్సలుడగు భగవానుని స్తుతించుటకు, ప్రార్థించుటకు, సాక్షాత్కారము చేసికొనుట కుపయోగించును.

ఇట్లే యింకను కొన్ని వేదమంత్రములకు తెలుగు వ్యాఖ్యాన మొనరింప నుద్దేశింపగా మామిత్రులు పండిత శ్రీ బ్రహ్మదత్తశర్మ 'భాయీ! అధర్వవేదమునందలి బ్రహ్మగవి సూక్తమునకు తెలుగువ్యాఖ్యానము వ్రాయరాదా' అని సలహా యిచ్చిరి. ఇంతేకాక 'యీ సూక్తమును స్వ. అభయదేవశర్మ గారు చక్కని వ్యాఖ్యానము ఆర్యభాషలో వ్రాసియున్నారు. దాని యనువాద మెంతయు బాగుండును' అనియు శర్మగారు నుడివిరి. మిత్రుని సలహాననుసరించి యీ బ్రహ్మగవిసూక్తమున కనువాదమువ్రాసి ఆంధ్రలోకమున కందజేయుచున్నాడ. పాఠకులు దీని యౌచిత్యమును గుర్తించి లాభము నందుదురుగాక !

గోపదేవ్.



# ప్రారంభిక వివేచన

ఈ బ్రహ్మగవిసూక్తముయొక్క యర్థము నెఱుంగుటకు-చదువుటకు పూర్వము పాఠకులు తమ హృదయములలో కొన్ని విషయములు బాగుగ నిలుపుకొనుట మిక్కిలి యావశ్యకము. శబ్దముల యర్థములు, శబ్దభావములు - అభిప్రాయములు సమయసమయమున మాఱుచుండును. వేదకాలమైన ప్రాచీన యుగమున ఒకశబ్దమున కేమియర్థముండెనో దానితోబాటు ఏయేభావములు మేళవించి యుండెనో యవియన్నియు నేడు మనము సరిగా తెలిసికొనలేము. వేదభాష మాటలాడు కాలములో నాటిమానవు లాపదముల భావములు పూర్ణముగ తెలిసికొనగలిగి యుండెడివారు. కాని, నేడు వేలకొలది కాదు, కోట్లకొలది సంవత్సరములు గడచినమీదట ఒకానొక క్రొత్త భాషను మాటలాడు మనకు వైదికశబ్దముల యర్థముల నెఱుగుట మిక్కిలికష్టము. వైదికభాషకంటె లౌకికసంస్కృతభాష యెంతో భిన్నమై పోయినది. వైదికశబ్దముల యర్థములు లౌకిక సంస్కృతమున చాలమార్పుచెందుటయే కాక పూర్ణముగ విపరీతములై పోయినవి. వ్రాత్యుడు-అసురుడు మున్నగుశబ్దములు ఇందులకు నుదాహరణములుగా తీసికొనవచ్చును. ఈ వాక్యముల తాత్పర్యమేమన బ్రహ్మగవిసూక్తఆశయములు సరిగా తెలిసికొనవలెనన్నన ఈసూక్తమునందలి కొన్ని ముఖ్యశబ్దముల యర్థములను తెలిసికొనుటకు మనము కొంత విశేషప్రయత్నమొనర్పవలసియున్నది. ఈ సూక్తమున నట్టి ముఖ్యశబ్దములు

నాలుగు. 1. గోశబ్దము, 2. 'అద' ధాతురూపములు, (అత్తవే, అద్యాత్-అన్నమ్ ఇత్యాదులు) 3. బ్రాహ్మణశబ్దము. 4. వైతహవ్యశబ్దము.

ఈ సూక్తము చాలవఱకు స్పష్టముగానే తెలియును. ఇందలి వాక్యరచన మిక్కిలి సరళము. పైనచూపిన నాలుగు శబ్దములను స్పష్టముచేయక యట్లే యుంచిన ఈ సూక్తసారాంశము నిమ్నశబ్దములలో తెలుపవచ్చును.

'ఓ రాజా? నీవు బ్రాహ్మణునిగోవును అదనము చేయకు. గొప్పదుష్పరిణామ మేర్పడును. చంపబడుచున్న బ్రాహ్మణ గోవు రాష్ట్రమును చంపివేయును. లోకమున వైతహవ్యులు వందలు, వేలు ఉందురు. కావున, వారెల్లరు గోవును అదనము చేయుటవలన చంపబడుదురు.'

ఈ సారాంశమును చదివిన పాఠకులు తెలిసికొనగలరు. 'కేవలము పైనాలుగుశబ్దముల యర్థములు స్పష్టమగునెడల నీ సూక్తము స్పష్టమగుటలో నాలస్యముండదు.' కావున నీసూక్తమును వివేచించుటకై మొదట నాలుగు విషయములు తెలిసికొనుట మనకెంతయు నావశ్యకము.

1. ఈసూక్తమున బ్రాహ్మణునిగో'వన నేమి ?
2. అదన శబ్దాభిప్రాయ మేమి ?
3. బ్రాహ్మణుడెవరు ?
4. వైతహవ్యుడెవరు ?

గోవు, బ్రాహ్మణుడు నను నీరెండుశబ్దములు సంస్కృత భాషయందేకాక భారతీయభాషలలోను మిక్కిలి ప్రసిద్ధములై యున్నవి. అయినను మనమెఱిగిన సుప్రసిద్ధములైన యర్థములు వేదమున నట్లు ప్రసిద్ధములు కావు. ఈసూక్తమున ముఖ్యముగా నీపదము లేయర్థములందు ప్రయోగింపబడినవో యవి సర్వథా భిన్నములు. అద ధాతువు విషయమునను ఇట్లే యెంచవలెను. వేదములోని అతిప్రాచీనపదముల యర్థములు, భావములు నెంతగానో నేడు మాఱిపోయినవని యింతకు పూర్వమే వ్రాసియున్నాము. వైతహవ్యశబ్దము మనకు మిక్కిలి యపరిచితము. దానియర్థమేమో విచారించి తెలిసికొనవలెను. అట్లే గోబ్రాహ్మణశబ్దములు, అదనశబ్దము నను నీమూటియాశయములుకూడ ఆలోచించి తెలిసికొనదగినవియే.

## 1. బ్రాహ్మణుని గోవు

ఈశీర్షికలో గోశబ్దమునుగూర్చియే ముందువిచారింపవలెను. గోశబ్దమునకు సంబంధవాచకముగా నున్న బ్రాహ్మణశబ్దము బ్రాహ్మణుడెవరు? అను ప్రకరణమున నాలోచింపవచ్చును.

ప్రస్తుతమున గోశబ్దమునువినగానే మనకు నాలుగుకాళ్లు గంగడోలు కలిగినజంతువు స్ఫురించును. ఇంతకుమించి మన కేమియు తెలియదు. మన మనస్సునందీయర్థము దృఢపడి యున్నది. వేదమునందీశబ్దమున కీయర్థముతోబాటు భిన్నార్థములు ననేకములున్నవి. అయినను లౌకికసంస్కృతము నేర్చినవ్యక్తి యీసూక్తమున గోశబ్దమునకర్థము మనము పాలించుపశువే యని యెంచును. ఇతరార్థమును కల్పింప జాలడు.

వైదిక నిఘంటువు - శబ్దకోశము 'గౌః, గ్మా, జ్మా, క్ష్మా' అను నీశబ్దములతోనే ప్రారంభింపబడినదని తెలిసికొనవలెను. 'గా' శబ్దముతోనే ప్రారంభింపబడినది. ఇట గోశబ్దమునకు పశువు అర్థముకాదు. పృథివి యని యర్థము.అనగా వేదమున గోశబ్దమునకు ప్రసిద్ధార్థము పశువుకాదని భావము. వైదిక సాహిత్యమున గోశబ్దమునకు ప్రసిద్ధార్థములు క్రమముగా పృథివి, ద్యులోకము, వాణి, ఆవు అని యేర్పడినవి. మఱియు లాక్షణికార్థములు ధనము, కిరణము, ప్రకాశము, ఇంద్రియములు, జలము, స్తుతిచేయువాడు, ఆవునకు సంబంధించిన పాలు, నేయి, చర్మము మున్నగునవియు, కాననగును. కావున నీసూక్తమునకుగల సరియైన అర్థము గ్రహించుటకు గోశబ్దమునకు ఆవు అనియే అర్థము, అను సంస్కారమును ప్రథమమున మనహృదయమునుండి తొలగించుకొనవలెను. ఈమాత్రమైన మనము చేయలేని పక్షమున వేదమున కన్యాయము చేసిన వారమగుదుము. ఇది చెప్పవలసిన యావశ్యక మేలకలిగినదన గ్రిఫిథ్ మున్నగు పాశ్చాత్యవిద్వాంసులు ఈ సూక్తమునందలి గోశబ్దమునకు ఆవు-గోవు అనియే అర్థము చేసియుండిరి. దీనికి కారణము మొదటినుండి వారిలో పడియున్న సంస్కారమే. గోవు అని యర్థము చేసినందున ఈసూక్తమున కర్థము ఏవిధమునను సంగతముకాదు. ఐనను ఇట్టి యర్థమునే వ్రాయుటలో పూర్వపు సంస్కారముల ప్రాబల్యము సిద్ధమగును. కావున వేదమును ప్రేమించుపాఠకులు వేదమునగోశబ్దమునకు పృథివి, దినము, వాక్కు, కిరణము, గోవులు మున్నగు అర్థములు పదునొకండో పంద్రెండో కలవనియు ఆయర్థములలో గోశబ్దము వేదమంత్రములలో ప్రయుక్తమైనదనియు తమ

2)

మనస్సునందు గుర్తుంచుకొనవలెను. వేదము నొకింత యధ్యయనము చేసినవారీవిషయమును తెలిసికొనియే యుందురు. సాధారణ వేదపాఠకులుకూడ గోశబ్దమునకు గల ౧౧, ౧౨ అర్థములలో గోవు అనుఅర్థము ముఖ్యము కాదని బాగుగ నెఱుగవలయును.

పృథివి మున్నగు ననేకార్థములలో నీసూక్తమునగల గోశబ్దమున కర్థమేమో విచారింపవలసియున్నది. మనము కొంచెము ధ్యానముతో నీసూక్తము నధ్యయనముచేసిన మనకీ సూక్తమునగల గోశబ్దమున కర్థము వాణి యనియు పృథివ్యాదులుగాని గోవుకాని కాదనియు తెలియకపోదు. ఈసూక్త వ్యాఖ్యను చదువునపుడు అక్కడక్కడ ఈసూక్తములోని గోపదమునకు గోవుఅర్థము కాదని తెలియుటకు వలసిన సంకేతములు చూడవచ్చును. ఇక్కడ నీప్రసంగమున గోశబ్దార్థము వాణి యను నీవిషయమును సిద్ధపఱచుటకు నీసూక్తమునందలి యొకమంత్రమును పొందుపఱచుట పర్యాప్తమని యెంచెద. మిక్కిలి స్పష్టముగా నీయంతసాక్షని వినినమీదట మనకింకొక ప్రమాణమావశ్యక మనిపింపదు. ఈసూక్తమునందలి 8వ, మంత్రమును చూడుడు.

"జిహ్వా జ్యా భవతి, కుల్మలం వాఙ్
నాడీకాదన్తా స్తపసాఽభిదిగ్ధాః
తేభిర్ బ్రహ్మా విధ్యతి దేవ పీయూన్
హృద్బలైర్ ధనుభిర్ దేవజూతైః."

ఈమంత్రమీసూక్తమున ముఖ్య మంత్రముగా నెంచ వలెను. ఇందు రూపకాలంకారముతో "బాధపెట్టురాజును బ్రాహ్మణుడు తనగోరూపధనుస్సుతో నెట్లు నశింపజేయునో చెప్పబడినది. కాని, ధనుస్సుతోపాటు ఈ గోవునకు సంబంధించిన రూపకమునందు ధనుస్సుయొక్క యంగములు వాణి యంగములతో పోల్చబడినవి. కాని గోవు అనెడి పశువుఅంగములతో కాదు.

రూపకము :-

జ్యా = వింటినారి జిహ్వా = నాలుక

బాణదండము - ఉచ్చారితశబ్దములు

బాణాగ్రము - నాడులు

అగ్ని - తపస్సు

ధనుర్దండము - హృదయబలము.

ఈ మంత్రమున గోశబ్దమున కర్థము గోవు-ఆవు అయినపక్షమున ధనుస్సునకు ఉపమానము జిహ్వ ఉచ్చారితశబ్దములు మున్నగునవి కాక గోవునకవయవములైన కొమ్ములు, తోక మున్నగునవి చెప్పవలసియుండెడిది. మంత్రార్థము స్పష్టముగానున్నను ఈసూక్తమునందలి గోశబ్దమునకు ఆవు-పశువు అర్థమని చెప్పువారి నేమనవలెను? కాని, వేదమునందలి విషయములు అప్రాసంగికములు, అసంబద్ధములు, అయుక్తియుక్తములుగా నుండునని యెంచువారికి వాణియనునర్థమున స్పష్టముగా ప్రయోగింపబడిన గోశబ్దమునకు గోవు అర్థము వ్రాయుటలో ఆశ్చర్యపడవలసిన పనియుండదు. పాశ్చాత్య

విద్వాంసులు, వారి ననుసరించు కొందఱు భారతీయులు వేద విషయములు గౌరవనీయములు, యుక్తియుక్తములు నని యెంచరు. వారి కట్టిశ్రద్ధ లేకపోవుటచే అనాలోచితముగ నేవో యర్థములు వ్రాయుదురు. లేదా విషయమున వారు సావధానముగ బ్రవర్తింపరు.కావున లౌకిక సంస్కృతసంస్కారములకు లోబడి వారు అర్థమునకు అనర్థములు వ్రాయుదురు.

ఈ సూక్తమున గోశబ్దమునకు వాణియే నిశ్చితార్థము. కాని, అన్యార్థములతో గోశబ్దమున కన్యత్రసంబంధము లేదని దీనియభిప్రాయము కాదు. వాస్తవమున గోశబ్దమునకుగల యర్థములన్నియు పరస్పరము సంబంధము లేనివికావు. ఈ సంబంధమును ముందు జూపుదుము. ఇక్కడ గోశబ్దము వాణి అనునర్థమున ప్రయోగింపబడినను, ఇందు వాణి=శబ్దమునకు పర్యాయపదములైన 'సరస్వతీ, గీః' మున్నగు పదములు, అట్లే వాణీ శబ్దము ప్రయోగింపక గోశబ్దమును ప్రయోగించుటలో నొకవిశేషప్రయోజనము లేకపోలేదు. ఇందు గోశబ్దమునకుగల యభిప్రాయమును సరిగా నేటిభాషలో ప్రకటింపవలయుననిన 'వాణీరూపగోవు అని' యర్థము చెప్పిన ఎక్కువలో నెక్కువ సరియైన అర్థము చెప్పినవారమగుదుము. ఈ భావము మంత్రమున వాణిశబ్దము ప్రయోగించిన స్పష్టమయ్యేడిది కాదు. గోశబ్దమునందే యాభావము నిండియున్నది. గోశబ్దముతో నిర్దోషిత, అమాయకత, రక్షణీయత మున్నగు భావములు కలిసియున్నవి. గోశబ్దముయొక్క భావమును మఱియొక విధముగా పాపం 'గోవు' అను పదములతో ప్రకటింపవచ్చును. 'పాపం' దరిద్రబ్రాహ్మణుడు చంపబడినాడు' అని ప్రయోగించినపుడు

ఈవాక్యమునందలి 'పాపం' అనుపదమునగల భావమే వైదిక భాషయందలి గోశబ్దముచేతకూడ ప్రకటింపబడును. వైదిక సాహిత్యమున గోవు నిర్దోషి, ఇతరులకు మేలుచేయునది, యెల్లపుడు నితరులచే రక్షింపబడదగినదియునగు జంతువుగా బోధపడునని తాత్పర్యము. కావుననే గోవునకు వైదికపర్యాయపదములు అఘ్న్య (ఎన్నడు చంపదగనిది), అదిత (అఖండనీయ) మున్నగునవి యగును. నిఘంటువునందు గోవు నామములను లెక్కించునపుడు ప్రప్రథమమున 'అఘ్న్య' అను పదము గ్రహింపబడినది. గోవు ఎల్లపుడు పాలింపదగినది. ఇట్లే బ్రాహ్మణవాణియునెల్లపుడు పాలింపదగినదియేయగును. ఈభావమును ప్రకటించుటకే యిట 'వాణి' శబ్దము గ్రహింపబడక 'గో' శబ్దము గ్రహింపబడినది. 'ఓరాజా! నివు బ్రాహ్మణవాణిని చంపకు' అనుటకు బదులు బ్రాహ్మణునిగోవును నాశముచేయకు అనుటలో నెంతో బలము ప్రకటమగును. ఇందు "బ్రాహ్మణవాణి పాపం! ఎల్లపుడు రక్షింపదగినది–పాలింపదగినది; ఉపకారము చేయునది; దానిని నశింపజేయుట యెంతో చెడుగు." అని ధ్వనితమగును. అంతే కాదు; దానిని చంపుట గోహత్య–గోవునుచంపుటచేకలుగు పాపముకలుగుననియు ధ్వనించును.

వైదిక–భాషలో గోశబ్దమేయేపదార్థములకు నామమో, యాగోవులన్నియు పాలింపబడిన నవియెంతయో ఉపకారకములగు ననుసమానభావము అపదార్థము లన్నింటివిషయమునను కలుగును. అట్లుకాక వానిని సహాయరహితములుగా నెంచి నశింపజేసిన నవి నష్టమగుటయేకాక వానితోబాటు మనము

నశింతుము. భూమి, వాణి, కిరణములు, గోవు మున్నగు పదార్థములన్నియు నిట్టివియే. భూమిరూపమగుగోవును దున్ని, తడిపి విత్తనములువేసి సేవచేసిన నది యొక్కగింజకు వంద లాది గింజలను మనకు ప్రసాదించును. గోవును పోషించినచో నది గడ్డితిని మనకు అమృతమయమగు దుగ్ధమునుపిండును. సూర్యకిరణరూపగోవులను మనము అడ్డగించిచంపకున్న వానిని నిరాతంకముగ గృహములందు ప్రవేశింపనిచ్చిన నవి జీవన శక్తిని ప్రసాదించును. ఇట్లే వాణిరూప గోవు అందునను బ్రాహ్మణవాణిరూపగోవు పోషింపబడి, రక్షింపబడిన ఎంతో యుపకారముచేయునది యగును. ఇట్టిభావమును ప్రకటించు టకే వాణివాచకపదము లెన్నియో యున్నను వానిని విడిచి యిక్కడ గోశబ్దము గ్రహింపబడినది. ఈభావమును ప్రదర్శిం చుటకే యీసూక్తమున గోపదమునకర్థము పలుమాఱు కేవ లము వాణియనక వాణి-గోవు, లేక వాణిరూపగోవు' అని వ్యవహరింతుము.

## అదన పదాభిప్రాయము

ఈ సూక్తమున బ్రాహ్మణవాణిని అడ్డగించుట-నిరోధిం చుట యనునర్థమున 'హన' ధాతువు, 'అద్' ధాతువు ప్రయో గింపబడినవి. ఈధాతువులకు అర్థములు వాణిని చంపుట, లేక తినివేయుట యని యగును. ఈయర్థములు మన చెవులకు అస్వాభావికముగాను కటువుగాను తోచును. డొంకతిరుగుడు అర్థములుగా కనబడును. ఒకభాషనుండి మఱియొకభాషలో అనువాదము చేయుటలో ఈదోషము వాటిల్లును. వేదము యొక్క నుడికారము తెలిసికొనినచో బ్రాహ్మణస్య గాం జగ్ధ్వా'

అను నీవైదిక వాక్యమున మిక్కిలి సౌందర్యము గననగును. ప్రాంతీయభాషలో 'బ్రాహ్మణుని వాక్కును తిని' అనునీవాక్యము వినుట కంత ఇంపుగా తోచదు'. 'వాక్కును తినుట' యనుప్రయోగము శ్రవణసుఖముగా కనిపింపదు. పాశ్చాత్య వ్యాఖ్యాకారులు 'బ్రాహ్మణుని గోవునుతిని' అని అర్థము సులభముగా చెప్పి, క్రమముగా వేదకాలమున జనులు గోవును తినెడివారు అని పరిణామము నూహించిరి. కాని, మనసంస్కారముల కనుకూలముగ వేదమున కర్థములు కల్పింపక, వేదమును పలుమాఱు చదివి, వైదికభావముల సంస్కారముల నలవఱచుకొని (మన పూర్వసంస్కారములను పూర్తిగవిడిచి) వేదమును చూచిన అప్పుడిట్టి పరిణామములను కల్పింపము. ఏయర్థములలో నెట్టి వాక్యరచన వేదమునందుండునో మనకు బోధపడును. గోశబ్దము కనబడగానే గోవు - పశువు అర్థము చెప్పుట 'జగ్ధ్వా' అనుపదమునకు 'తిని' అనియర్థముచెప్పుట ఎంతటి యనర్థమో వేదమున కెంతటి యన్యాయముచేయుట యగునో చెప్పజాలము.

ఎవడైన అంగ్లభాషలోనున్న 'స్వీట్‌గరల్' (Sweet Girl) అనుపదమునకు తియ్యనిపిల్ల యని యర్థముచెప్పిన యతని నజ్ఞాని యందురు. ఒకప్పుడు గురుకులమున ఇంగ్లీషు పాఠము చెప్పుటకు నియుక్తుడైన యొక 'సింధి' యధ్యాపకుడు (హిందీభాష నెఱుగనివాడు) ప్రథమదినముననే 'స్కాట్' వ్రాసిన 'మార్మియన్' నామక కవితను చెప్పుచు 'స్వీట్‌గరల్' (Sweet Girl) పదమునకు 'మీఠీలడకీ' - 'తియ్యని' పిల్ల యనియే పాఠముచెప్పెను. ఈయర్థమును వినిన వారిలో నెవ

రైన 'స్కాట్' కాలములో ఇంగ్లండు వాసులు ఆడపిల్లలను తినుచుండెడివారు కాబోలు. లేకున్న పిల్ల తియ్యగా నుండునది లేక చేదుగా నుండునది వారికెట్లు తెలిసియుండును ? అని అనుమానించిన నెంతటి యనర్థమగును ? పదములకిట్టి యనర్థములను కల్పించుట పాపమగును. ఇట్లే వేదమునందలి (బ్రాహ్మణస్య గాం జగ్ధ్వా) వాక్యమునకు బ్రాహ్మణునిగోవును తిని యని యర్థము చెప్పుట మిక్కిలి పాపమగును.

'స్వీట్‌గరల్' అనుపదమునకు అయమ్మాయి మంచి స్వభావము కలది, మనస్సునకు ప్రసన్నత కలిగించునదియని చెప్పుటకంటె ఆ యమ్మాయి చాలమంచిది యనుట మిక్కిలి సుందరము, కావ్యమయభాషయు నగును. అట్లే రాజు బ్రాహ్మణునివాణిని నిరోధించును-లేక యతనిని మాటలాడ నియ్యడు. అని చెప్పుటకు బదులు బ్రాహ్మణవాణిని తినును-చంపివేయును అని చెప్పుటలో కనిపింపదా? తినివేయుననుటలో ప్రకటమగు భావము వాణి నడ్డగించుననుటలో నంతగా ప్రకటము కాదు. తినివేయుననుటలో అతడావాణిని సులభముగా నాశనముచేయును. దాని నంతముచేయుటలో నతని కానందము కలుగునని స్ఫురించును. "ఇట్టి భావమును ప్రకటించుటకే యిట వేదమున 'అద' ధాతువు ప్రయోగింపబడినది. ఈసూక్తమునందే చూడుడు.

(1) "యో బ్రాహ్మణం అన్నమేవ మన్యతే" (మం-4)

(2) "యో మల్వాః బ్రాహ్మణ మన్నం స్వాదు అద్మి ఇతి మన్యతే" (మం-7)

1. ఎవడు బ్రాహ్మణుని అన్నముగా నెంచునో.

2. ఏ మల్వ్వుడు-శక్తిశాలినని యెంచురాజు 'బ్రాహ్మణుని రుచిగలఅన్నముగా తినుచున్నాన'ని యెంచునో అని యర్థములు.

ఇట పాశ్చాత్యులుకూడ బ్రాహ్మణుని తినివేయుట యని కాని బ్రాహ్మణుని నమిలి మ్రింగుట యనికాని యర్థము చెప్పదురా! అట్లు అర్థము వ్రాయలేదుకూడ. గోవును తినకుండుట యను విషయమున వారికి మిక్కిలి సందేహము కలుగవచ్చునేమో కాని, బ్రాహ్మణుని తినుట యనువిషయమున తప్పక సందేహము కలుగును. అందువలననే బ్రాహ్మణుని తినును అని యర్థము చెప్పరైరి. బ్రాహ్మణుని తినుట సంభవము కాదు కదా! అటులయిన నీవాక్యమున అన్నపదమున కర్థమేమి? అన్నము తినువస్తువే కదా! కావున నిట అన్నశబ్దప్రయోగము అలంకారికమనక తప్పదు. కావున నిట బ్రాహ్మణుని కష్టపెట్టుట యనియే యర్థమగును. బ్రాహ్మణుని సులభముగా కష్టపెట్టవచ్చును. లేక చంపవచ్చును. కాబట్టి యీసూక్తమునందు బ్రాహ్మణపదముతోబాటు ప్రయోగింపబడిన గోపదము (వాణి) విషయమునగూడ నట్టియభిప్రాయమునే ప్రకటించుట యుచితముకాదా! బ్రాహ్మణపదముతోనున్న అదనపదమునకు బాధపెట్టుట యని యర్థమెట్లు సంగతమో అట్లే బ్రాహ్మణపదముతోబాటు ప్రయోగింపబడిన గోపదమునకు సంబంధించిన అదనపదమునకుగూడ అడ్డగించుట నిరోధించుట-నశింపజేయుట అని యర్థము చెప్పుటయే సమంజసమగును. కాని, బ్రాహ్మణుని గోవును అనగా ఆవును భక్షించుట యని యర్థము

చెప్పుట మిక్కిలి యనుచితమనుటలో సందేహము లేదు. బ్రాహ్మణపదముతోనున్న అదనశబ్దమునకు బాధించుట-నశింప జేయుట యని యర్థమగునెడల (అక్కడ 'గ్రిఫిట్' 'హన్తి' పదమునకు Smites అని యర్థముచెప్పినాడు Kills అని చెప్పలేదు.) వాణినికూడ నశింపజేయుట యని యర్థముచెప్పక తినుట యని యర్థమునెట్లుచెప్పెను?

కావున నిట 'అదన' పదమున కభిప్రాయమేమన; రాజు తనశక్తితో నితరములగు చెడుగుల నెట్లునశింపజేయునో యట్లే నిరపరాధియగు బ్రాహ్మణుని సరళమగు (గోవును) వాణినికూడ నిరోధింపగలడు-నశింపజేయగలడు అనియే యగును. బ్రాహ్మ ణవాణి రాజున కతితుచ్ఛముగా కనిపించును. దానిని నశింప జేయుట యతనికతి సులభము. భక్ష్యవస్తువును నమలుట యెంతసులభమో యంతసులభమని భావము.

ఇంతయేల! 'రాజా ప్రజాకో ఖా జాతా హై; రాజు ప్రజ లను పీడించి తినుచున్నాడు.' అని ప్రాంతీయభాషలలో ప్రయోగింతురు. ఇక్కడ ఖాజానా=తినుట, యని యర్థమైనను రాజు ప్రజలను చంపితినడుకదా! ఇట 'తినుట' 'ఖా జానా' అనుపదముల కర్థము పీడించుట యనియే యగును. రాజు ప్రజలను పీడించుకుతినుచున్నాడనుటలో గల విశేషార్థము బాధపెట్టుచున్నాడనుటలో లేదని స్పష్టమగును. అట్లే యీ సూక్తమున బ్రాహ్మణగోవును 'హన్తి-అత్తి' చంపును-తినును అనుటలో నెంతటి విశేషార్థము ప్రకటమగునో బాధపెట్టునను టలో ప్రకటముకాదనుట నిర్వివాదము.

పాఠకులకు తెలుపుట కిట మఱియొక విషయము కూడ వ్రాయుచున్నాము. ఈసూక్తమున వాణిపదముతో బ్రయోగింపబడిన 'అద' ధాతుప్రయోగము 'అద=భక్షణే' అను ధాతు ప్రయోగము కాదు. అది, 'అదీ=బంధనే' అను వైదికధాతు ప్రయోగము. కావున వాణి నదనముచేయుటయనగా వాణిని బంధించుట యనియే యభిప్రాయము. సామాన్యముగా భాషలో ప్రయోగములు ముందు, తరువాత ధాతువులు నేర్పడును. అందువలననే 'అద' ధాతుసిద్ధశబ్ద ప్రయోగము తినుట, బంధించుటయను రెండర్థములలోను చూడనగును. కావుననే 'పాణిని' కూడ 'అదభక్షణే,' 'అదీ-బంధనే' రెండుధాతువులు ధాతుపాఠమున చేర్చియున్నాడు. కావున వాణిని అత్తి=బంధించుచున్నాడు అనుట మిక్కిలి యుచితము.

కాని శబ్దశాస్త్రమునకు సంబంధించిన శబ్దములలో నీ విషయమును బోధింపవలసివచ్చిన మనకీప్రయోగము అద భక్షణే ధాతురూపముయొక్క నుడికారముగానే యెంచుట అధికసమంజసమగును. ఈసూక్తమున వాణి అను నర్థమున గోశబ్దము ప్రయోగింపబడియున్నందున అదనమునకు భక్షణ భావము గ్రహించుటయే బాగుండును. వేదమున వ్యాకరణ నియమము లంతగాపాటింపవలసిన యావశ్యకము లేకున్నను, ఇట 'అదభక్షణే ధాత్వర్థమున ప్రయోగమని యెంచుటయే సమంజసముగా తోచును. ఈసూక్తమున ప్రయోగింపబడిన అదన పదప్రయోగము, భక్షణ, బంధనార్థకములలో దేనికి చెందినదైనను అదనపదమున కర్థముమాత్రము వాణిని అడ్డగించుట-బంధించుట-బ్రాహ్మణుని మాటలాడనీయకుండుట

యనియే యర్థము చెప్పకతప్పదు. అంతే కాని బ్రాహ్మణ గోవును నోటిలో వేసికొనిదంతములతో నమలుట మాత్రమెన్న డునుకాదు.

'గోవు,' 'అదనము' అను శబ్దములనుగూర్చి యింతగా చర్చించిన మీదట, 'వాణిని బంధించుటయని చేసిన అర్థము' డొంకతిరుగుడు అర్థము కాదని తెలిసికొని, యీసంగతార్థము నకు సంబంధించిన సంస్కారము హృదయములందు నెల కొల్పి పాఠకులు, పాశ్చాత్యులు తమ సంస్కారములకు వశులై చేసిన గోవునుభక్షించుట యనునర్థము సరియైనది కాదని యనర్థమని తెలిసికొనగలరని భావించుచున్నాము. ఇక ఈసూక్తమున ప్రయోగింపబడిన బ్రాహ్మణశబ్దార్థ మేమి ?

## 3. బ్రాహ్మణు డెవరు?

బ్రాహ్మణశబ్దము వినుటయే తడవుగా మనపూర్వపు సంస్కారములు మనయెదుట నేడుభారతదేశముననున్న అను దారులు' మూఢాచారముల నుపాసించు బ్రాహ్మణనామధారు లైన వ్యక్తులను గోచరింపజేయును. ఆ మన సంస్కారములు అపఠితులు, పరాన్నభుక్కులు, వంటచేసిబ్రతుకువారు నగు బ్రాహ్మణులను మన స్మృతి పథమునకు తీసికొని రానిపక్షమున వేదాధ్యయనము చేయువ్యక్తి వేదవర్ణితబ్రాహ్మణుడు ఉపర్యు క్తవ్యక్తులవంటివాడు కాడని తెలిసికొనజాలక పోడు. వేదబోధిత బ్రాహ్మణుడు ముఖస్థానీయుడుగా నెంచబడెను. ముఖమువలె నతడు మిక్కిలి నిస్స్వార్థపరుడు. తాను స్వయముగా భోగ లాలసుడుకాక ఇతరులకు జ్ఞానదానము చేయుచు యజ్ఞము

మూలమున నెల్లప్పుడు నితరులకు ఉపకారముచేయువాడు. ఇది వైదికబ్రాహ్మణుని సామాన్యస్వరూపము.

కాని, యీసూక్తమునగల బ్రాహ్మణుడు ప్రజలతో సంబంధముగలవాడు. కావున నతడు ప్రజలకు నిస్స్వార్థ సేవకుడుగా నెంచదగినవాడు. ఇందులకు తగినప్రమాణము లీసూక్తమునెన్నియో కలవు. పండ్రెండవమంత్రమున ప్రజలు బ్రాహ్మణుడు ప్రజగా చెప్పబడుట చూడనగును.

'ప్రజాం హింసిత్వా బ్రాహ్మణీమ్!'
('బ్రాహ్మణుని ప్రజను హింసించి')

ఇట్లే 5-19 సూక్తమున 11వ మంత్రమునను ప్రజలు బ్రాహ్మణుడు ప్రజయని చెప్పబడిరి. దీనికంటె ముందు 5-17 సూక్తమున(బ్రాహ్మణ ఏవ పతిః న రాజన్యో న వైశ్యః) 'బ్రాహ్మణుడే పతి; క్షత్రియుడు కాడు; వైశ్యుడు కాడు.' అని బ్రాహ్మణుడే లోకసభకు పతి యని చెప్పబడినది.

ఈ బ్రహ్మగవిసూక్తమున ఆఱవమంత్రమున బ్రాహ్మణుడు ప్రియమైనరాష్ట్ర-శరీరమునకు అగ్నిగావర్ణింపబడినాడు. ఈ వచనములవలన ఈ సూక్తమునకు చెందిన బ్రాహ్మణుడెట్టివాడో పాఠకులకు తెలిసియే యుండును. బ్రాహ్మణుడు ప్రజలకు నిస్స్వార్థముగ గొప్పసేవచేయువ్యక్తి యని యభిప్రాయము. ఇదియే యీసూక్తమున ప్రకటింపబడినది. ఈ సూక్తపు 13వ మంత్రమున బ్రాహ్మణుడు దేవబంధువ'నియు, ప్రజాద్రోహియగు రాజునకు దేవపీయువనియు చెప్పబడెను.

దానినిబట్టియు ఈ సూక్తపుబ్రాహ్మణుడు ప్రజకు నిజమైన నాయకుడనియు తెలియును. ఈ యిరువదియవ శతాబ్దమున భారతదేశమున గాంధిమహాత్ముని స్థానమును పాఠకులు మనస్సున ధ్యానించినచో వారికిసూక్తపు బ్రాహ్మణునికల్పన బాగుగ స్పష్టము కాగలదు. ఈ సూక్తమునందలి బ్రాహ్మణ శబ్దమట్టి నిజమైన ప్రజానాయకు నుద్దేశించియే ప్రయోగింప బడినది. ఈ యుగపు నిజమైన సత్యాగ్రహి శబ్దభావమే ప్రాచీనబ్రాహ్మణపదభావము. బ్రహ్మశబ్దమున కర్థము సత్యజ్ఞానమో లేక అనుభవజ్ఞానమో యని చెప్పవచ్చును. సత్యజ్ఞానమగుటవలననే వేదముకూడ బ్రహ్మపదముచే చెప్పబడును.

దీనితోబాటు బ్రహ్మశబ్దమునకు వేదమున కర్మ అనియు అర్థము కలదు. యాస్కముని బ్రహ్మయన కర్మ అనియే అర్థము చెప్పుచున్నాడు. కావున సత్యజ్ఞానమును కర్మరూపమున పరిణతము చేయువాడు అని బ్రాహ్మణశబ్దభావము. ఇట్లు బ్రాహ్మణుడన నొకసత్యాగ్రహియైన ప్రజానేత యని తెలిసికొనుట మిక్కిలి యుచితమని సిద్ధమగుచున్నది.

ఇట్టిబ్రాహ్మణునివాణి యెంతగొప్పదియో పాఠకులిప్పుడు సులభముగా నూహింపగలరు. బ్రాహ్మణునిలోనున్న ముఖ్యవస్తువు వాణియే. పురుషసూక్తములోని 'బ్రాహ్మణోஉస్య ముఖమాసీత్' అను నీవాక్య మతిప్రసిద్ధము. రాష్ట్రశరీరమునకు బ్రాహ్మణుడు ముఖము. రాష్ట్రము బ్రాహ్మణునిద్వారమున మాటలాడును. మనుష్యుని శరీరమునగల ముఖముతో బ్రాహ్మణుడు పోల్చబడుటవలన నా పోలికను బాగుగ ఆలోచించిన

మనకు ముఖమునందు ఐదుజ్ఞానేంద్రియములు కనిపించును. మఱియు నొక కర్మేంద్రియము వాణియు నున్నది. అనగా సర్వవిధముల జ్ఞానము నుపార్జించి బ్రాహ్మణుడేదైన కర్మ నాచరించిన నది వాణిపనియే యగుననిభావము. జ్ఞానమును వాణితో నతడు ప్రసారము చేయును. అతడు శరీరబలమునుగాని, ధనబలమునుగాని పెంచి రాష్ట్రసేవ జేయడు. వానిని త్యజించి సర్వోత్తమమగు జ్ఞానబలము నుత్పన్నముచేసి దానిని వాణి మూలమున ప్రసారము నతడు చేయవలసియున్నది. ఇదియే సర్వోత్తమసేవ. అట్టిది చేయుటవలననే యతడు సమాజమునకు సర్వోత్తముడు (శిరస్సు) అగును. కావున సమాజమున జ్ఞానప్రసారము చేయుటకు ఉపదేశించు కర్తవ్యము, అధికారము నట్టిబ్రాహ్మణునకే కలవని స్పష్టమగుచున్నది. ఏదో యొక యుపాయముతో అట్టిబ్రాహ్మణుని సత్యోపదేశము చేయకుండునట్లు అడ్డగించుట-అతనివాణిని బంధించుట - నిరోధించుట ఎంతటి గొప్పపాపమో కూడ స్పష్టమగుచున్నదికదా ! అందువలననే యీసూక్తమున బ్రాహ్మణ-వాణిని నిరోధించుట మిక్కిలి కఠోరశబ్దములతో నిందింపబడినది.

కావున నీసూక్తమును సరిగా స్వాధ్యాయము చేయుటకు ప్రస్తుతమున బ్రాహ్మణులని చెప్పబడువారిని జూచి మన యంతఃకరణమున బ్రాహ్మణుని విషయమున నెట్టిసంస్కారము లేర్పఱచుకొని యున్నామో వానిని విస్మరించి సూక్తమున జెప్పబడిన బ్రాహ్మణుడు పైనజెప్పినట్లు నిజమైన నిస్స్వార్థ ప్రజాబంధువనియు ప్రజానాయకుడనియు గుర్తింపవలెను.

# 4. వైతహవ్యుడెవరు?

వైతహవ్యశబ్దమున కర్థము తెలిసికొనుట యంతకష్టము కాదు. ఇది యొక యప్రసిద్ధమైన శబ్దము. ఈ శబ్దమునకు సంబంధించిన సంస్కారము లశుద్ధము లైనవి మనమనస్సు లందు లేవు. కావున వానిని తొలగింపవలసినకష్ట ముండదు. కావున ధాత్వర్థపూర్వకముగ నీపదార్థమును సరిగా తెలిసి కొనుట సులభమగును.

వీతహవ్యశబ్దముతో వైతహవ్యశబ్దమేర్పడుచున్నది. 'వీ ఖాదనే, అను ధాతువువలన గాని, వి పూర్వకమగు 'ఇణ్ ధాతువువలనగాని వీతశబ్ద మేర్పడును. వీత మన తినబడినది, సమాప్తము చేయబడినది, వ్యయముచేయబడినది యని యర్థము.

కావున (వీతం ఖాదితం హవిః హవ్యః వా యేన)హవిస్సు హవ్యము ఎవనిచే తినబడినదో యతడు వీతహవ్యుడనబడును. దేవతలభాగము హవ్యమనబడును. యజ్ఞమున దేవతల నుద్దే శించి యర్పింపబడు ద్రవ్యము హవ్యము. యజ్ఞమునకు సంబంధించిన యీపదార్థమును తినుట మిక్కిలి పాపము. ఇది యసురుల కార్యమగును. కావున యజ్ఞసంబంధమైన-దేవతలభాగమైన-హవ్యమును వారికి చేర్పక స్వయముగా తిని వేయు పాపి వీతహవ్యు డనబడునని యర్థము. కాని రాష్ట్ర విషయమున వీతహవ్యుడన నేమి యభిప్రాయమగును? వీనిని తెలిసికొనుటయన రాష్ట్రయజ్ఞమున హవ్యమేమగునో కొంచెము ఆలోచించి తెలిసికొనుట యగును. రాష్ట్రయజ్ఞమున హవ్యము

ప్రజలనుండిపొందిన పన్ను (Tax)గా నెంచవలెను. సాధారణ హవనమునందు అర్పించు ఘృతము, ఓషధులచూర్ణమును హవ్యమేల యందురు. హవి, హవ్యము 'హుదానాదానయోః' అను ధాతువుచే నేర్పడును. ధాత్వర్థము దానాదానములు-అనగా ఇచ్చుట పుచ్చుకొనుటలు. యజ్ఞమున నర్పించు హవ్యము - దానముచేయు హవి, వేయిరెట్లు ఎక్కువయై మరల మనకు లభించును. ఇదియే ఆదానమగును. ఇదియే హవనమహత్త్వము. ఇందే హవ్యములోని హవ్యత యిమిడియున్నది. ఇట్లే రాష్ట్రయజ్ఞము ప్రజలిచ్చు పన్ను రూపమగు హవ్యముతో నడచును. ప్రజ రాజుకు పన్ను చెల్లించును. ఇది దానము. రాజు - ప్రభుత్వము పన్నురూపమున లభించినద్రవ్యము సదుపయోగముచేయును. అందువలన ప్రజలకు తామిచ్చిన పన్నులకు బదులు వందరెట్లు లాభము-ఆదానము కలుగును. పన్ను విధించుటలో నుద్దేశమిదియే. కాళిదాసు మహాకవి రఘువంశమున రఘుమహారాజుయొక్క పన్నువిధానమును సూర్యునితో బోల్చి యుపర్యుక్తమగు నుద్దేశమునే వర్ణించియున్నాడు.

"ప్రజానాం భూత్యర్థం సతాభ్యో బలిమగ్రహీత్
సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః"

'ప్రజల సమృద్ధికొఱకే ఆ రాజు-రఘువు ప్రజలనుండి పన్నును గ్రహించెను. సూర్యుడు సముద్రాలనుండి జలము నాకర్షించుట, వేయిరెట్లు పెంచి వర్ష రూపమున మరల భూమి కిచ్చుటకే గదా!" తాత్పర్యమేమన రాష్ట్రయజ్ఞమున 'పన్నే'

హవి యగును. వేదమున 'పన్ను' అను నర్థమున హవిశబ్దము అటనట ప్రయోగించుట చూడనగును. పైశ్లోకమున బలిశబ్దము హవికి సమానార్థక మనుట స్పష్టమే, కావున వీతహవ్యుడన ప్రజలనుండి పన్నురాబట్టి తినునట్టి రాజు-ప్రభుత్వము-అని యర్థము. అనగా పన్నును స్వార్థమునకు ఉపయోగించువాడని భావము. వీతహవ్యశబ్దముతోనే వైతహవ్యశబ్దము సిద్ధించును. వీతహవ్యునకు సంబంధించిన వ్యక్తి-వ్యక్తులు వైతహవ్యుడు-వైతహవ్య లనబడుదురు. నేటిభాషలో వైతహవ్యులనగా ప్రభుత్వాధికారు లనవచ్చును.

సంస్కృతమున కరః, బలిః రెండు శబ్దములు పన్ను అర్థమున ప్రయోగింపబడును. ఈ సూక్తమున బలిశబ్దము వాడక హవ్యశబ్దమును ప్రయోగించుటలో కొంత విశేషార్థము బోధపడవలసియున్నది. హవ్యమును తినివేయుట మిక్కిలి పాపమగును. కారణమేమన యజ్ఞము దివ్యము, పవిత్రము నైన కార్యము. అందువలన కొండొకరాజు పన్నును దుర్వినియోగము చేయువాడు 'అనుటకంటె' రాష్ట్రయజ్ఞమునకు సంబంధించిన హవ్యమును తినివేయువాడు అనుటవలన ఎక్కువ దోషియని ప్రకటమగును. అందువలననే 'వీతబలి' యనక వీతహవ్యుడు అని చెప్పబడెను. రాష్ట్రసంచాలనమును గూడ పవిత్రయజ్ఞముగా నెంచుట వేదమునకు వైదికసభ్యతకు నొక విశేషత యగును.

## 5. ఈ సూక్తవిషయము

ముఖ్య ముఖ్య శబ్దములను వివేచించిన మీదట పాఠకులొకమాటు ఈసూక్తముయొక్క సముచ్చయార్థమునుగూర్చి

విచారింపుడు. ఈ సూక్తమునకు ప్రతిపాద్యవిషయము సంక్షేపముగా నిది.

భోగియు విలాసియు నగు నొకరాజు ఉన్నాడనుకొనుడు. (మం. 2). కావుననే యతనికి ధనమావశ్యకమగును. అతడు ధనకామి యగును (5). అతని మనస్సున పాపమేర్పడును. కావున నతడు వీతహవ్యుడగును. ప్రజలనుండి వచ్చుపన్నుల మూలమున వచ్చిన ధనమును స్వయముగా తిననారంభించును (మం. 10). అంతట ప్రజలు పీడితులగుదురు. ప్రజలకు హింసలు మెండగును. (మం. 12). అట్టి సమయమున ప్రజలకు సేవచేసి వారిని రక్షించుటకు ప్రజానాయకుడు-బ్రాహ్మణు డొకడు వెలువడును. అతనిదగ్గఱ యతని వాణి - మాటలకు మించి యేమి యుండును? కావున రాజునకు సదుపదేశము సేయును. కాని, ఆ దుష్టరాజు నిశ్శస్త్రుడగు నాబ్రాహ్మణుని; అతని వాణిని 'నేను తినివేయుదును. సులభముగా నీతనిని, ఇతనివాణిని నాశము చేయగలనని యెంచును. అంతేకాక ఇతడు తననేమిచేయగలడు అని యెంచి యతని వాణి నడ్డగింపజూచును. ఇట్లు అతని వాణిరూపగోవును నశింపజేయును; లేక చేయజూచును. ఈ దశలో వేదముపదేశించు విధమీ సూక్తమున వర్ణింపబడినదని యెంచవలెను.

ఈ స్థితి యెన్నడో, ఏదో దేశములో నేర్పడిన దాని నిట వర్ణించినదని యెంచరాదు. ప్రపంచమున నెన్నడైన, నేదేశము నందైన నిట్టి స్థితి కలుగవచ్చుననియే దీనిభావము. రాజులు, ప్రభుత్వములు వీతహవ్యులగుటలో నాశ్చర్యము లేదు. ఎప్పుడు

నిట్లు జరుగుట సహజము. ఇది యొకనిత్యమైన ఇతిహాసము. అట్టి సమయములందు రాజుగాని ప్రజలుకాని యేమి చేయ వలయునో బోధించుటయే వేదకర్తవ్యము. అందులకే యీ సూక్తమున నిట్లుపదేశింపబడినది.

ఈసూక్తమున రాజు బ్రాహ్మణవాణిని తుచ్ఛముగా నెంచ రాదని మాటిమాటికి నుపదేశింపబడినది. ఇంతేకాక 'ఆవాణి నశింపజేయదగినదికాదు. అది మిక్కిలి భయంకరరూపమును ధరించును' అని పలుమాఱు రాజునకు బోధింపబడినది. ఇట్టి బోధ యావశ్యకము. కారణమేమన బ్రాహ్మణునియొద్ద బలము కాని, అస్త్రశస్త్రములుకాని యుండవు. వాణియే యతనిబలము కావున కొండొక మూర్ఖశాసకుడు స్వార్థాంధుడై బ్రాహ్మణుని సత్యవాణిని తనకు హానికారకముగా నెంచి, తన దుష్టక్షాత్రబల ముతో నణచవచ్చును. కావున భయంకరశబ్దములతో నీస్థితి యిట నిందింపబడినది. బ్రాహ్మణవాణి రూపశస్త్ర మెంత దుర్దాంతమో యదియు వర్ణింపబడినది. అది రాజశక్తిని పరా స్తము చేయగలదు.

ఇప్పుడు పాఠకు లీకథను హృదయగ్రాహకములగు సుందర వైదికశబ్దములలో జదువుడు. ఈ వైదికసూక్తమును పూర్తిగ చదివి మరల నొకమాటు ఈ వివేచనమును జదివినచో పాఠకుల కిందలిసత్యము బాగుగ బోధపడగలదని మఱియొక మాటు సూచించుచున్నాడ.

# బ్రహ్మగవి - సూక్తమ్

## బ్రాహ్మణవాణి నడ్డగింపరాదు.

ఓ3మ్ "నైతాం తే దేవా అదదు స్తుభ్యం నృపతే అత్తవే
మా బ్రాహ్మణస్య రాజన్య గాం జిఘత్సో అనాద్యామ్" ౧.

నృపతే!=ఓరాజా! తే దేవాః=అ ప్రసిద్ధులైన దేవతలు, ఏతాం=ఈ బ్రాహ్మణవాణిని, తుభ్యం = నీకొఱకు, అత్తవే= తినుటకు, న అదదుః=ఇయ్యలేదు, కావున, రాజన్య! రాజా! నీవు, బ్రాహ్మణస్య=బ్రాహ్మణుని, అనాద్యాం = తినదగని - ఎన్నడు తినశక్యముకాని, గాం=వాణిని, మా జిఘత్సః=తిన గోరకుము.

మంత్రాభిప్రాయము :- ఎవరో దేవతలు బ్రాహ్మణుని (గోవును) వాణిని రాజునకిచ్చిరి. కాని వాడు దాని నతడు తినుటకియ్యలేదు. ఆ రాజునకా బ్రాహ్మణగోవు-వాణి తిన దగినది కాదని స్పష్టముగా వర్ణింపబడినది.

రాజునకు బ్రాహ్మణవాణి నిచ్చిన దేవతలెవరు? అగ్ని, ఇంద్రుడు, వరుణుడు, సోముడు మున్నగు దేవతలు వేదమున మిక్కలి ప్రసిద్ధులు. ఈ దేవతల కన్నింటికి నధిదేవత పర మాత్మ. అతడీదేవతల నన్నింటిని పూర్ణముగ శాసించును. ఆ పరమాత్మయే తన వివిధశక్తులతో నీజగత్తును శాసించును. అతని యాశక్తులే ఇంద్రాదిదేవతలు. మానవరాజు తన యల్ప శక్తితో రాజ్యమును శాసించును. అతని శాసనవిధికి అంగము లుగా ననేకవ్యక్తులుందురు. ఒకరాజునకు తనరాజ్యములోని

నానావిధశాఖలతో నెట్టి సంబంధముండునో పరమేశ్వరునకు జగత్తులోని అగ్ని, ఇంద్రాదిదేవతలతో నట్టిసంబంధమే యుండును. మనువు రాజును సర్వదేవమయుడనుటలో నీయర్థమే స్ఫురించును. మనుస్మృతిలోని యేడవ యధ్యాయమునందలి 3 నుండి 11 వఱకుగల శ్లోకము లీసంబంధమున జదువ దగినవి.

"ఇంద్రానిల యమార్కాణా మగ్నేశ్చ వరుణస్య చ;
చంద్రవిత్తేశయోశ్చైవ మాత్రా నిర్హృత్య శాశ్వతీః"
"సోఽగ్నిర్ భవతి వాయుశ్చ సోఽర్కః సోమః స ధర్మరాట్
స కుబేరః స వరుణః, స మహేంద్రః ప్రభావతః."

ఈశ్లోకములలో "ఇంద్రుడు, వాయువు, యముడు, సూర్యుడు, అగ్ని, వరుణుడు, సోముడు, కుబేరుడు, ననునీయెనిమిదిదేవతల యంశలతో రాజగును. రాజుయొక్క అష్టవిభాగములందు గలశక్తి యీ యెనిమిది దేవతలవలన లభించినదియే. అని వర్ణింపబడినది. శుక్రనీతిసారమున ప్రథమ-అధ్యాయపు 71 నుండి 81 వఱకుగల శ్లోకములందు వీని వ్యాఖ్యయు చూడనగును. ఈ యెనిమిది ప్రసిద్ధదేవతలే మానవులలో రాజగువానికి సర్వశక్తులను - సర్వవస్తువులను ఇచ్చుచున్నవి. ఈ అగ్నిమున్నగు దేవతలవలన రాజున కొకవంక అనేకవస్తువులు రాజ్యమొనర్చుటకు లభించుచుండ, మఱియొకవంక బ్రాహ్మణవాణి (బ్రాహ్మణుడు ప్రజలకు నిచ్చు ఉపదేశములు, శిక్షణ, సన్మార్గదర్శనము) యను నొక

గొప్పవస్తువు కూడ లభించుచుండును. బ్రాహ్మణునివాణి యననేల బ్రాహ్మణుడే రాజునకు లభించుననిన బాగుండును. బ్రాహ్మణుని బ్రాహ్మణత్వమే యతని వాణియందుండును. బ్రాహ్మణుడు వాణిమూలముననే యతడు రాష్ట్రమునకు సేవ యొనర్చును. ఈ బ్రాహ్మణవాణి-వాక్కు (గోవు) ఒక గొప్ప మహత్త్వముగల వస్తువు. దీనినే దేవతలు-లేక-పరమాత్మ రాజున కిచ్చినట్లెంచుట ఇట యుక్తముగా తోచును. అందు వలన నిట పశురూపగోవు నిచ్చిరనుట యంతసమంజసము కాదు.

ఇట రాజున కొక బ్రాహ్మణవాణి రూపమగువస్తువు నిచ్చి నట్లు స్మరింపజేసి, యది నీకు తినుట కిచ్చునది కాదు. అది నీకు తినశక్యముకానిది యనియు, వేదము స్మరింపజేసినది. దీని భావమేమి? ఈ బ్రాహ్మణ-గోవు-వాణి స్వాధీనతాపూర్వక ముగ రాష్ట్రమున జ్ఞానమును వ్యాపింపజేయుచు, ప్రజలకు సన్మార్గమును ప్రదర్శింపజేయుచు రాష్ట్రకల్యాణము-శ్రేయస్సు నకు తోడ్పడ నొసంగబడినది. కావున దీనిని పాలించి పోషింప వలెను. కాని నశింపజేయరాదని భావము.

రాజున కనేకవస్తువులు తినివేయుటకే యియ్యబడును. రాజునందుగల యమునియంశ మందులకే యుపయుక్తము. రాజు రాష్ట్రమున మంచిని పెంపుచేయవలెను. రాష్ట్రహితము నకు తోడ్పడు వస్తువులను ఉత్పన్నము చేయవలెను. వానితో బాటు రాష్ట్రమున కనర్థమును గలిగించు పదార్థములను పెంపు కానీయక నాశమొనర్పవలెను. సర్వవిధములగు ననర్థ

ములను, అపరాధములను, అశాంతులను, అవ్యవస్థలను, బలవంతులచే నిర్బలులు బాధింపబడుటను అన్యాయమును నష్టముచేయవలెను. రాజు యముడై వీనిని నశింపజేయదగు నని భావము. కాని బ్రాహ్మణ-వాణి యట్టిదికాదు. అది అనాద్య-తినదగినది-నశింపజేయదగినదికాదు. అది దేవతలచే నొసంగబడినది. కావున పాలనీయము-వర్ధిల్లజేయదగినది. అది పోషింపబడి, తన పాలనకగు వ్యయముకంటె వేయిరెట్లు అధికఫలము నొసంగి రాష్ట్రమును సమృద్ధము చేయును.

గోవు అనాద్య-అఖాద్యము ఎన్నడు నశింపజేయదగినది కానేకాదు, ఈ యనాద్యశబ్దమే యీమంత్రమున ముఖ్య శబ్దము. దీనిఅర్థము అత్తుమశక్యా-నాశము జేయ శక్యము కానిది, యని చెప్పుట యుచితము. ముందు రానున్న మంత్ర ములలో నీయర్థము స్వయముగా స్పష్టమగును. ఇక్కడ మాత్రము గోవు-అఘ్న్య-చంపరానిదియని యెట్లుచెప్పబడునో యట్లే బ్రాహ్మణవాణి రూపగోవుకూడ నాశము చేయదగినది కాదని గ్రహించుటయే యుక్తము. బ్రాహ్మణవాణి నడ్డగించుట నాశముచేయుట జఘన్యపాపము. ఇది గోహత్యవంటిదగును. ఇయ్యది దేవతలొసంగినవస్తువు; దురపయోగము చేయరానిది. లోకమున నెవనివాణియు నడ్డగింపశక్యము కాదు. ప్రతివ్యక్తి కిని వాక్స్వాతంత్ర్య ముండవలెను. అట్టియెడ బ్రాహ్మణవాణిని గూర్చి యేమనగలము? దీని ప్రాధాన్యమింతకుముందే వర్ణింప బడినది. అన్యులవాణి అజ్ఞానవశముననో స్వార్థవశముననో హానికారకము కావచ్చును. కాని నిస్స్వార్థియు జ్ఞానియునగు బ్రాహ్మణవాణియందు హితము శుభము నిండియుండును.

అట్టివాణిని రక్షించుటవలననే సమాజము రక్షింపబడును. కావున నీవాణిని రక్షించుట సామాన్యగోవు మున్నగుపశువుల ప్రాణరక్షణకంటె నెన్నియోరెట్లు ఉత్తమము; అవశ్యకమును. బ్రాహ్మణవాణి ప్రేరణచే వేలకొలది పశువులరక్షణ జరుగ గలదు. కావుననే యీసూక్తమున బ్రాహ్మణవాణి 'అనాద్యా' నాశయోగ్యముకాదని పలుమాఱులు ఉపదేశింపబడినది.

ఇకనీరెండవమంత్రమున ఈయనాద్యవాణి నశింపజేయు ఘోరకృత్య మొనర్పయత్నించు రాజెవడో, అడడెట్టివాడో స్పష్టము చేయును.

## ఎట్టిరాజు బ్రాహ్మణవాక్యము నడ్డగించును

"అక్షద్రుగ్ధో రాజన్యః, పాప ఆత్మపరాజితః;
స బ్రాహ్మణస్య గామద్యాత్, అద్య జీవాని మా శ్వః" ౨.

అక్షద్రుగ్ధః=జితేంద్రియుడు కానివాడు-ఇంద్రియములతో ద్రోహ మొనర్చువాడు, పాపః=పాపి, ఆత్మపరాజితః=తనచేతనే తాను ఓడింపబడినవాడునైన, రాజన్యః=రాజు, సః=అతడే, బ్రాహ్మణస్య=బ్రాహ్మణునియొక్క, గాం=గోవును - వాణిని, అద్యాత్=అడ్డగించును, అయినను, అతడు, అద్య=నేడు, జీవాని=జీవించును; కాని, మా శ్వః=రేపు జీవింపడు.

ఇంద్రియములకు దాసులై వానితో ననేకదుష్కార్యము లొనర్చుచు పతితులగువారు ఎన్నడైన రాజ్యపదము నధిష్ఠింతు రేని పాలింపదగు బ్రాహ్మణవాణిని నశింపజేయ బూనుదురు.

5)

అట్టివారికే సత్యమును సతతము చెప్పు బ్రాహ్మణవాణి హాని కారకముగ దోచును. ఈ యుగమున మహాతేజస్వియైన బ్రాహ్మణుడు-మహర్షి దయానందసరస్వతి తాను వెళ్లిన తావులలో నున్నవారికెల్లరకు తన సత్యవాక్కులతో నుపదేశించుచుండెడివాడు. కాని యతని సత్యవాణివలన క్షుద్రులు స్వార్థపరులు నైనవారికి వారి యింద్రియసుఖములకు బాధకలిగెడిది. అప్పుడు వారు ఋషిని చంపుటకు నుద్యుక్తులయ్యెడివారు. మహర్షివాణి నడ్డగింప వారు కోరెడివారు. ఒక్కనాడు ఇంద్రియలోలుడైన యొకరాజును వేశ్యాగమనమునుండి ముక్తుని జేయు సదుద్దేశముతో మహర్షి తన ఓజస్వినీవాణి నుపయోగించెను. అదియే మహర్షియొక్క దేహలీలాసమాప్తికి కారణమైనదని నుడువుచున్నారు. ఎవడో యొకతుచ్ఛుడా మహర్షికి గాజుపొడి కలిపిన పాలను త్రాగనిచ్చెను. రాజు విలాసియైననాడు బ్రాహ్మణవాణిని సహింపజాలడు. అతనిమనస్సున పాపసంకల్ప ముదయించునని స్పష్టపడుచున్నది.

మనుష్యు డజితేంద్రియుడై కాముకుడైననాడు పాపముల నొనర్చి యవశ్యము పతితుడగును. అందువలననే యీ మంత్రమున నట్టిరాజునకు 'అక్షద్రుఃగ్ధః' యనియే కాక 'పాపః' పాపి యనియు విశేషణము ప్రయోగింపబడినది. అర్జునుడు, 'మనుష్యుడు పాపమున నేలప్రవృత్తుడగున'ని కృష్ణునడుగగా, భగవాన్‌కృష్ణుడును 'కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః' అని నుడివినట్లు భగవద్గీతలో చదువుదుము. కామమునకు క్రోధము తోడైయుండును. మనుజుడు కొండొకదానియం

దాసక్తుడై దానిని విరోధించుదానినుండి దూరము కాదలచి క్రోధముతో పాపమున ప్రవృత్తుడగును.

కామక్రోధములు రెండును పాపజనకములు, వాని యాభ్యంతరసూక్ష్మరూపములే రాగద్వేషములు. ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులలో నొక సుందరమైనకథ చూడ నగును. ఒకప్పుడు దేవాసురులలో యుద్ధము జరిగెను. దేవతలు తమయింద్రియములను క్రమముగా నన్నిటిని ఉద్గాతగాచేసిరి. కాని, అసురు లాయింద్రియముల నన్నింటిని పాపయుక్తములు చేసిరి. ఆ యింద్రియములలో రాగద్వేషములుండును; కావున వానిని పాపయుక్తములు చేయగలిగిరి. ప్రాణములలో మాత్రము రాగద్వేషములుండవు. కావున నసురులు ప్రాణములను పాప యుక్తములు చేయజాలక పోయిరి. అంతేకాక వాని నెదుర్కొని యసురులు పరాజితులైరి. దీని యభిప్రాయమేమి? అన, ఇంద్రియములందుగల రాగద్వేషములు స్థూలరూపమున కామ క్రోధములగును. కావున నింద్రియదాసులు సహజముగ పాప మున ప్రవృత్తులగుదురు.

జితేంద్రియుడు కానిరాజు తన యింద్రియముల విషయ మున కామము కారణముగ దానిని విరోధించు బ్రాహ్మణుని వాణివిషయమున క్రోధము కారణముగ పాపమున నేలపడడు? దానిఫలితముగా అజితేంద్రియుడగురాజు బ్రాహ్మణునిగోవు-వాణిని నశింపజేయుటయను పాపమునకును తలపడును.

అట్టిరాజునకు మంత్రమున మూడవవిశేషణము 'ఆత్మ పరాజితుడు' అని వాడబడినది. ఈ పదమునకర్థము 'తనచే

తానే యోడింపబడినవాడు. దానితోబాటు అతడు నేడు బ్రతికి యున్నాడు, కాని రేపు నిశ్చితముగా జీవింపడు, అని యతని నాశము వర్ణింపబడినది. ఈ వినాశమునుగూర్చి గంభీరముగ నాలోచించిన మంత్రమునగల గూఢభావమొకటి ప్రకట మగును.

భగవద్గీత ద్వితీయాధ్యాయమున 62,63 శ్లోకములలో నీవినాశము సుందరముగా వర్ణింపబడినది.

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే
క్రోధాత్ భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి."

మనుష్యుడు మొదట శబ్దస్పర్శాది విషయములను ధ్యానముచేయును. దానివలన వానియందు సంగమేర్పడును. దానివలన వానికొఱకు కోరిక కలుగును. దానిని సఫలము చేసికొనుటలో కలుగుబాధలను ఎదుర్కొనుటలో వానిలో క్రోధముద్భవిల్లును. క్రోధము సమ్మోహమునకు కారణమగును. అందువలన తనను తాను విస్మరించును. ఆ స్మృతివిభ్రమము వలన బుద్ధి స్థిరముగా నుండదు. ఇట్లు బుద్ధినాశముతో పురుషుడు నశించును. ఇది మనుష్య వినాశక్రమము. విషయధ్యానముతో నాశము ప్రారంభమై బుద్ధినాశముతో నది పూర్తియగును. అట్లే యీ మంత్రమున అట్టిరాజుయొక్క వినాశము అక్షద్రోహము-అజితేంద్రియతతో ప్రారంభమగును. ఆత్మపరాజయ

ముతో నది యంతమగును. మధ్యక్రమ మీమంత్రమున పాప శబ్దముచే సూచింపబడినది.

ఈ దృష్టితో నీమంత్రమున వర్ణింపబడిన వినాశక్రమ మును జూడుడు. అక్షద్రుగ్ధః=అక్షై రింద్రియైర్ ద్రుగ్ధః=ఇంద్రి యములద్వారమున ద్రోహము ప్రాప్తించును. జితేంద్రియుడు కాని పురుషుని ఇంద్రియములు ద్రోహము చేయును. సుఖా పేక్షతో మనుష్యుడు వానికి దాసుడగును. కాని వానికవి సుఖము నొసంగుటకు బదులు అతనిలో తృష్ణను పెంచును. అట్లు వానినవి తమకు మిక్కిలి దాసునిగా చేసికొనును. ఇంద్రియము లతనిని వంచించి లోబఱచుకొనును. మానవ జీవనరూప రాజ్యమునకు నిజమైన రాజు ఆత్మ. ఈ యింద్రియ ము లారాజ్యమునందు నిమ్నశ్రేణికి చెందిన నౌకరులు. కాని యీ సేవకులు సుఖము నిచ్చునెపముతో మనుష్యుని వంచించి లోబఱచుకొనును. అప్పు డీయాత్మరాజ్యమున ఇంద్రియ ద్రోహము ప్రారంభమగును. ఈ రాజద్రోహము క్రమముగా వృద్ధిజెంది పరాకాష్ఠను ప్రాపించినపుడు ఆత్మకు పరాజయము కలుగును. ఇంద్రియములు ఆత్మను రాజసింహాసనమునుండి దించి తామా యాసనము నాక్రమించుకొనును. అప్పుడే మనుష్యు డాత్మపరాజితు డనబడును. ఇంద్రియము లాత్మకు విరుద్ధముగా రాజద్రోహమనెడి జండానెత్తి బాహ్యవిషయము లతో సంగము నేర్పఱచుకొనును. బాహ్యశత్రువులయిన కామ క్రోధసమ్మోహములను సహాయముకొఱ కాహ్వానించును. వాని

సహాయము రాజు(ఆత్మ)కు అధికారులైన సూక్ష్మప్రాణములను చిత్తమును, మనస్సును లోబఱచుకొనును. అప్పుడే స్మృతి విభ్రమస్థితి యేర్పడును. చివరకు ఆత్మ కత్యంతవిశ్వాసపాత్రుడగు బుద్ధి రూపమంత్రికూడ పతితుడగును. అప్పుడాత్మ రాజ్యము పూర్తిగ నశించును. "బుద్ధినాశాత్ ప్రణశ్యతి." ఇట్లు 'ఆత్మద్రుగ్ధ, ఆత్మపరాజిత' శబ్దములభావము గ్రహింపనగును.

ఇంద్రియముల రాజద్రోహము సఫలమై అంతరిక-ఆత్మ రాజ్యము సమాప్తమైన పురుషుడు రాష్ట్రము నెట్లు శాసింపగలడు? అతనిలో రాజ్యముచేయుశక్తియే యుండదు. ఇట్టి రాజు అచిరకాలములో నంతరించునని వేదము చెప్పుచున్నది. అట్టివాడు ప్రస్తుతమున పైకి జీవించియున్నట్లు కనిపించినను వాస్తవమున నతడు లోపల మరణించి యున్నాడనియే యెంచవలెను. కావుననే యతడు రేపు జీవింపడని మంత్రపర్ణములు చెప్పుచున్నవి. 'మా శ్వః', అని. మనము శరీరదృష్టితోచూచి నేడు జీవించియున్నాడనుచున్నాము. ఆత్మ నవలోకింపగలవారికతడు నేడే చచ్చి కనిపించును. ఆత్మజ్ఞులందువలననే యట్టివారికి-రాజుల కెన్నడు భయపడరు. బాహ్యదృష్టిగలవారు అతని బాహ్యంగములను సేనావారాదులను చూచి భయపడుదురు. కొంచెముకూడ ముందుదృష్టి లేనియట్టివారికి 'అద్యజీవాని మా శ్వః' నేడు జీవించియున్నాడు; కాని, రేపు ఉండడు' అను వాక్యార్థమున విశ్వాస మెట్లు కలిగింపగలము? అట్టివిశ్వాసము లేనివారికి దృఢత యెటనుండి వచ్చును ? భయమెట్లు తొలగును ?

అడ్డగింపబడిన బ్రాహ్మణవాణి మిక్కిలి భయంకరవస్తువు'

"ఆవిష్టితాఘవిషా, పృదాకూరివ చర్మణా
సా బ్రాహ్మణస్య రాజన్య!, తృష్టైషా గౌరనాద్యా" 3.

[ఏషా=ఈ, అనాద్యా=నశింపజేయదగని, బ్రాహ్మణస్య గౌః = బ్రాహ్మణునివాణి, తృష్టా = దప్పికతోగూడినదగును, మాటాడ తీవ్రమగు కోరికగలదై మాటాడనీయనప్పుడు, సా= ఆవాణి, చర్మణా ఆవిష్టితా=చర్మముతో కప్పబడినదైన, పృదాకూః ఇవ = ఆడపాము-సర్పిణి-వలె, అఘవిషా = భయంకర విషము కలదియగును.]

బ్రాహ్మణవాణి మిక్కిలి సరళము, దయగలది, పరోపకారకమునై యెవ్వనికి హాని చేకూర్చునది కానిదే యైనను, అది నిర్బంధింపబడినపుడు(దప్పికగలదియైనపుడు) అడ్డగించు రాజునకో లేక ప్రభుత్వమునకో యెట్టిదగునో యీమంత్రము చెప్పుచున్నది.

అది యప్పుడు భయంకరవిషసర్పిణికి సమానమగును. సర్పిణి-నాగుపాము పైకి మిసమిసలాడు సుందరమైన చర్మముతో కప్పబడియుండును. ఒక నిర్దోషప్రాణివలె గనిపించును. కాని దానినోటియందు ఘాతుకవిషము నిండియుండును. దాని యందావిషము లేకున్న నది యెల్లరకు ప్రియకరము, సుందరమునగు నాటవస్తువయ్యెడిది. అట్లే యీ నిర్బంధితమగు బ్రాహ్మణవాణి యెంతో యమాయకము, సరలముగా తోచినను,

అట్టిరాజునకు లేక ప్రభుత్వమునకు మిక్కిలి భయంకరవిష పూరితమగును.

అడ్డగించుటచే విషపూరితమగును. అడ్డగింపరాని దాని నడ్డగించిన కలుగుపరిణామ మిదియే. వాయువును గదినుండి బయటకి రానీయక బంధించిన నది యేమియు ననదు. కాని గదిలోనున్నవాయువు విషయుక్తమగును. మనమృత్యువునకు కారణమగును. శరీరమునగల రుధిరగతి నడ్డగించిన శరీరము విషాక్తమగును. కలరావలన మృత్యువు సంభవించును. కారణమేమి? శరీరమున మూత్రము బంధింపబడును. విష పూరితమై మృత్యువునకు దారితీయును. వాస్తవమున శరీర మును పవిత్రముచేయు వస్తువుల నడ్డగింపక వానిని స్వతంత్ర ముగా ప్రవహింపనీయవలెను. వాని నడ్డగించిన పవిత్రత కలుగనేరదు. బ్రాహ్మణవాణియు నట్లే పవిత్రము చేయునది. దానిని మూర్ఖుడు, స్వార్థపరుడునగురాజు తన కహితకరమని యెంచి దానిని బంధించును. అట్లు చేసినందున మేలుకలుగు నని యెంచును. కాని పవిత్రమొనర్చువాణి నడ్డగించినందున రాష్ట్రమున పవిత్రత కలుగదు. దీనింబట్టి బ్రాహ్మణవాణిని బంధించిన నది యెట్లు విషమగునో, యది విషసర్పిణితో నేల పోల్చబడినదో స్పష్టమై యుండును.

వాస్తవమున బ్రాహ్మణవాణియందు విషమెన్నడు నుం డదు. అది యమృతముతో నిండియుండును. కాని, సామాన్య జనులలో సహజముగా ప్రత్యపకారబుద్ధి, క్రోధము, హింస, ద్వేషము మున్నగువిషము లుండును.అవి యన్నియు స్వాధీన బ్రాహ్మణవాణిమూలమున తొలగింపబడుచుండును. అందు

వలన రాష్ట్రమున విషము వృద్ధిపొందదు. కాని, యెన్నడైన నొకమూర్ఖుడైన పరిపాలకునిచే అనాదృతము, పావమానము, స్వాధీనమునగు బ్రాహ్మణవాణి యడ్డగింపబడినచో పరిణామ మేమగును? జనులలో నట్టి రాజు విషయమున ద్వేషము, ఘృణ మున్నగు విషము వృద్ధియగును. దేశక్షేమము గోరు దేశనాయకుని యుపదేశవాక్కులు ప్రజలలోని చెడుగుల నెంతగా దూరముచేయునో రాజ్యాధికారు లెందఱు ప్రయత్నించినను అంతగా మార్పు తీసికొని రాజాలరుకదా! కావున నుత్తమబ్రాహ్మణునివాణి పవిత్రమొనర్చువస్తువు. అన్నివిషములను దూరమొనర్చుటయే దానిపని. అది రాజులో, ప్రజలలోనుగల దోషములను దూరమొనర్చుటకే కోరును.

ఈ మంత్రమునగల తృష్టాశబ్దము విశేషముగా విచారింపదగినది. తీవ్రేచ్ఛగలిగినది, అని దీనియర్థము. వాణి మాటలాడగోరును. దానిని మాటలాడనీయని పక్షమున నది 'తృష్టా' యనబడును. తృషధాతువు విశేషముగ త్రాగుకోరికలో రూఢమైనది. ఈ రూఢార్థమును చెప్పినచో తృష్టాయన దప్పిక కలిగినదని యర్థమగును. మనకు దప్పికయైనదనిన అర్థమేమి? శరీరమున నేదో విషము చేరియుండును. దానిని బయటికి పంపి పవిత్రముచేయుటకు శుద్ధజలమావశ్యకమగును. అప్పుడు జలము త్రాగుదుము. అట్లే బ్రాహ్మణవాణియు రాష్ట్రమున సంచితమైన విషమును - దోషమును - బోగొట్టుటకు తీవ్రేచ్ఛగలదియగును. అప్పుడే యది మాటలాడగోరును. అనగా 'తృష్టా' యగును. కాని యపుడు రాష్ట్రపాలకుడైన రాజు మూర్ఖుడైనచో నతడామాటలను విననొల్లడు. వాని నడ్డగించును.

వాణికిగల దప్పికను తీర్చుకొననీయడు. అప్పుడు రాష్ట్రమున విషము సంచితముకాక మఱి యేమగును ?

వాయువుతో వచ్చు ఉష్ణతకుగాని, శైత్యమునకుగాని భయపడి వాయువును లోపలికి రానీయక పూర్తిగా నిరోధించిన నది యతనిహానికి కారణమగును. శుద్ధవాయువు ప్రవేశింపని గదిలో నతడెంతకాలము జీవించును? శైత్యమునకుగాని, ఉష్ణతకుగాని భయపడి వాయువును నిరోధించుట తేలుకు భయపడి సర్పముఖమున బడుటయే యగును. ఇట బ్రాహ్మణవాణిని నిరోధించు మూర్ఖునకుగలుగుహానిని వేదమంత్రము స్పష్టముచేసినది.

## ఈవాణి యెల్లరియందును అగ్నిని రగుల్పచేయును

"నిర్ వై క్షత్రం నయతి హంత వర్చోరగ్నిరివారబ్ధో
విదునోతి సర్వమ్,
యో బ్రాహ్మణం మన్యతే అన్నమేవ, స విషస్య
పిబతి తైమాతస్య"

[నిరోధింపబడిన బ్రాహ్మణ-వాణి, వై=నిశ్చయముగ, క్షత్రం నిర్‌నయతి=రాష్ట్రమునుండి క్షత్రమును వెడలగొట్టును, వర్చః హన్తి=తేజస్సును నశింపజేయును, ఆరబ్ధః అగ్నిః ఇవ=జ్వలింపజేయుబడిన అగ్నివలె, సర్వం విదునోతి=అంతయు దగ్ధముచేయును, కావున, యః బ్రాహ్మణం అన్నం ఏవ మన్యతే=ఏరాజు బ్రాహ్మణుని తినదగినఅన్నముగానేయెంచునో,

సః త్త్రైమాతస్య విషస్య పిబతి=వాడు కఱగబెట్టబడిన విషమును లేక సర్పవిషమును త్రాగును.]

పలువురు వైద్యులు, రోగులును శరీరమునుండి బయట బడగోరు వాతపిత్తాది దోషములయంశములను ఔషధసేవనము మూలముననో, యితరములైన యప్రాకృతికములగు నుపాయములవలననో అణచజూతురు. కాని యాదోషాంశములను అణచుటకు ఫలము కేవలము అది యారూపమున బయటబడజాలకపోయినను మఱియొకరూపముననైన బయటపడును. బ్రాహ్మణవాణిని అణచుటకు ప్రయత్నించిన నదియు నట్లే యగును. వాణి యాంతరికభావప్రకాశకమే కదా? దానిని నిర్బంధించిన అది యేదొయొకరూపమున బయటపడక పోదు. దానిని సర్వథా నిరోధించుట యసాధ్యము. అది అనాద్య-నాశయోగ్యము కాదు-బంధింప నలవికానిది. వాతపిత్తాదిత్రిదోషములు కుపితములై వికృతములగును. అవి రోగలక్షణములతో ప్రకటములగును. అట్లే బ్రాహ్మణవాణియు వికృతమై కుపితమగును. వికృతరూపమున ప్రకటము కాకమానదు.

ఆఱవమంత్రమున బ్రాహ్మణవాణి అగ్నిరూపమని చదువుదుము. ఆ యగ్నిరూపబ్రాహ్మణవాణి నిరోధింపబడి వికృతమగును. వికృతాగ్నిరూపమును ధరించునని భావము. మన శరీరమున శుద్ధమగు నవికృతాగ్ని యెల్లపుడు నుండును. దాని వలననే శరీరస్థితియు నేర్పడుచున్నది. తినినపదార్థములు బాగుగ జీర్ణించినందువలన నది యేర్పడును. నానావిధఖాద్యపదార్థములను పచనముచేయుటయే దానిపని. అందువలన శరీరము స్వస్థము, పుష్టము నగుచున్నది. ఈ యగ్ని వికృత

మైననాడది 'శరీరమున జ్వరము నుత్పన్నము చేయును. అప్పుడు శరీరమంతయు దగ్ధము కాజొచ్చును. శరీరమున జరుగుకార్యజాతమంతయు చెడిపోవును. శరీరము నిర్బల మగును. సహనశక్తి నశించును. చిత్తమున నుత్సాహము నుండదు. ఆకలి సన్నగిల్లును. దప్పిక యధికమగును. ఇట్లెన్నో యుపద్రవము లేర్పడును. ఇట్టిస్థితియే రాష్ట్రరూప శరీరమున బ్రాహ్మణ-వాణిరూపాగ్ని యడ్డగింపబడి వికృతమై నపుడును కలుగును. రాష్ట్రమప్పుడు ఉత్తప్తమగును. 'దు-ఉపతాపే' అనుధాతువువలన దునోతి శబ్దము సిద్ధించును. రాష్ట్రమున అగ్ని యంతటను వ్యాపించును. ఒక్కనిప్పుకణముతో అగ్నియంతట వ్యాపించునట్లు నిరోధింపబడిన బ్రాహ్మణవాణివలన ఆరాజురాష్ట్రమున నతని ప్రణాళికలవిషయమున విరుద్ధములగు నాలోచనలు వ్యాపింపదొడగును. ప్రజలలో ఉత్తేజనము-రోషము-పెంపగును. రాష్ట్రమున 'ఆలోచనలకు సంబంధించిన అనియంత్రిత క్రాంతి యుప్పతిల్లును. చెడుగులతోబాటు మంచికూడ నాశము కాజొచ్చును. సర్వము నష్టమగును. 'అగ్నిరివారబ్ధో విదునోతి సర్వమ్'.

బ్రాహ్మణ-వాణి నిరోధింపబడుటవలన కలుగున దింతే కాదు. జ్వరమువలన శరీరశక్తి నశించి శరీరము నిర్బలమగునట్లు రాష్ట్రరూపశరీరమున బ్రాహ్మణవాణి కుపితమైనపుడు రాజ్యమునకు విరుద్ధముగా నుత్తేజనరూపమగునగ్ని రగుల్కొనును. అంతట రాష్ట్రమున క్షాత్రశక్తి రాష్ట్రమును గాయపడుటనుండి రక్షించుబలము నశించును. రాజునెడల లేక ప్రభుత్వమునెడల జనులలో విరోధమెంతగా ప్రబలునో రాష్ట్రక్షాత్ర

బల మంతగా నశించును. రాజ్యాధికారులు ప్రభుత్వసేవనుండి దూరమగుదురు. ప్రజలు వశముననుండరు. అరాజకత యేర్పడును. ప్రజలు రాజును పదవీచ్యుతునిజేయుటయో ప్రభుత్వమును మార్చుటయో జరుగును. చరిత్రలో నిట్టివి యెన్నియో జరుగుట మనమెఱుగుదుము. పూర్వకాలమున వేణురాజు సింహాసనచ్యుతుడైనాడు. ఇంగ్లండులో చార్లెస్ఫస్టు' ఫ్రాంసులో 'లూయీ 16' ను కొఱతవేసిరి. రష్యాప్రజలు తమరాజగు జార్ చక్రవర్తిని అంతముచేయుట నెవరెఱుగరు?

ప్రారంభమున క్షాత్రబలము నశించువిధ మంతగా గోచరింపదు. మంచములో పడియుండు జ్వరరోగికికూడ తనశక్తి నశించుచున్నట్లు చాలరోజులు తెలియదు. ఆతడు లేచి కూర్చుండలేనపుడో, నడవజాలక పడిపోయినపుడో యది బోధపడును. అట్లే విప్లవితరాష్ట్రముమీద పరరాష్ట్ర మెత్తివచ్చినపుడో, మఱియొక దుర్ఘటన సంభవించినపుడో యారాష్ట్రము నిలువజాలదు. కారణమేమన దేశవాసులు రాజునకు సహకరింపరు. ప్రజలసానుభూతి రాజునకు లభింపదు. అప్పుడే తనక్షాత్రశక్తి నశించినట్లు గుర్తించును. రాష్ట్రమున క్రొత్తశాసన మేర్పడువఱకు నానిర్బలత యట్లే యుండును. బ్రాహ్మణవాణిని నిరోధించినందువలన నెంతటి దుష్పరిణామమేర్పడునో దీనింబట్టి యూహింపనగును.

కృత్రిమమగు జ్వరాగ్ని శరీరమున నెక్కువైనపుడు స్వాభావికమగు తేజస్సు క్షీణించును. రాజ్యమునకు విరుద్ధముగా నవాంఛితమగు నాందోళనాగ్ని ప్రజ్వలించినపుడు అరాజ్యమున శాసనభీతి సన్నగిల్లును. దానితేజస్సు నశించును.

జ్వరము పోయినపిమ్మట మనుష్యుని నిస్తేజస్కత ప్రకటమగు నట్లు శాసనముయొక్క తేజోనాశనముకూడ ప్రపంచమున నప్పుడప్పుడు నాలస్యముగా ప్రకటమగుచుండును.

క్షత్రమున్నంతకాలము క్షాత్రతేజస్సుండును. అది నశించిన తేజస్సును నశించును. ఇయ్యది స్వాభావికము. అట్టి యెడ పరరాష్ట్రము లతనిని విశ్వసింపవు. అతనిమైత్రినిగోరవు. పైపెచ్చు అతని నణచుటకు యత్నించును. స్వరాష్ట్రము నందును క్షాత్రతేజస్సు క్షీణించినకొలది విరోధాగ్ని వర్ధిల్లజొచ్చును. సాధారణప్రజలు రాజ్యభీతిని వదలి విరోధులతో చేతులు కలుపుదురు. ఇట్లు విరోధాగ్ని ప్రచండరూపమును ధరించి ప్రజావిరుద్ధశాసనమును పూర్తిగ దహింపజేయును.

బ్రాహ్మణవాణి నడ్డగించుటచే రాష్ట్రముపై నిట్టి యాపదలు వచ్చును. దాని నడ్డగింపక శాంతచిత్తముతో వినినచో రాజునకు ప్రజలకు నుభయులకు లాభముకలుగును. రాజు దానిని విని తాను శుద్ధుడైనను, రాజ్యమును విడిచిపెట్టినను ప్రజలకంతకష్టము కలుగదు. సత్యవంతులగు బ్రాహ్మణుల వాణిలో నెల్లపుడు తేజస్సు ఉండును. స్వాభావికశక్తి యుండును. వారు నిస్స్వార్థులు, తపస్వులు నగుదురు. సాధారణజను లాబ్రాహ్మణవాణి శక్తిని గుర్తింపజాలరు. దానివలన నొకప్పుడు రాష్ట్రమున విప్లవాగ్ని ప్రజ్వరిల్లినపుడే దానిని వారు గుర్తింతురు. బ్రాహ్మణవాణి నిరోధింపబడక స్వాభావికగతి ననుసరించుచున్నంతకాల మది రాష్ట్రమున శాంతముగా తన కర్తవ్యమును నిర్వర్తించుచు నుత్తమకార్యములను నిర్వర్తించుచుండును. అప్పుడే రాజునకు ప్రజలకు నుభయులకుశుభము

చేకూరును. కావున దానినెన్నడు నడ్డగింపరాదు. అడ్డగించిన నది మఱియొకవిధమున బయటపడకమానదు.

ఈమంత్రమున నుత్తరార్ధమున వర్ణింపబడిన విషయము స్పష్టమే. బ్రాహ్మణుని భక్షింపదగిన అన్నముగా నెంచురాజు కఱగిన విషమును త్రాగినవాడగును. కఱగిన విషము త్వరగా తనప్రభావమును జూపును. ఇతరసాధారణజనులవాణిని అడ్డగించుటయు విషపానమే యగును. బ్రాహ్మణవాణిని నడ్డగించుట కఱగినవిషపానము వంటిది. 'త్రైమాతస్య'=నీటిలోకలిపిన, విషస్య=విషముయొక్క పానమువంటిదని భావము. కఱగిన విషమనగా నిట నీళ్లలోకలిపిన విషమని భావము.

కొందొకయజ్ఞాని విషమును తినుచు నేను అన్నమును తినుచున్నాను; దీనివలన నేను బలవంతుడనగుదుననియెంచినట్లు ధృష్టుడో, మూర్ఖుడో యైనరాజు సత్యవంతుడగు బ్రాహ్మణుని-నిస్స్వార్థనాయకుని-వాణిని నిరోధించి దానివలన తాను బలవంతుడ నగుదునని యెంచును.అతనిమనోరథ మెన్నడును సఫలము కాదు.

## ఇట్టిరాజునకు బాహ్యాభ్యంతరములలో నెక్కడను శాంతి లభింపదు.

"య ఏనం హన్తి మృదుం మన్యమానో
దేవపీయుర్ ధనకామో న చిత్తాత్

సం తస్యేంద్రో హృదయేఽగ్ని మిన్ధ
ఉభే ఏనం ద్విష్టో నభసీ చరన్తమ్".

[యః=ఎవడు, దేవపీయుః = దైవభావమును నశింపజే యునో, ధనకామః=ధనాభిలాషియో యట్టిరాజు, న చిత్తాత్= అజ్ఞానమువలన, మృదుం మన్యమానః ఏనం హన్తి=బ్రాహ్మ ణుడు బలహీనుడు,కోమలుడు ననియెంచి యతనిని నాశనము చేయునో, తస్య హృదయే=ఆరాజు హృదయమున, ఇంద్రః= ఇంద్రుడు, అగ్నిం సం ఇంధే=అగ్నిని ప్రజ్వలింప జేయును, ఏనం చరన్తం=మఱియు లోకమున చలించు - వ్యవహరించు నితనిని, ఉభే నభసీ=పృథివ్యాకాశములు రెండును - ఈరెండు లోకములందుండు దేవతలెల్లరు, ద్విష్టః=ద్వేషింతురు.]

పూర్వమంత్రమున మూర్ఖతవలన విషము నన్నముగా నెంచురాజు బ్రాహ్మణుని పీడించుట తనకు హానికరమని యెంచక లాభకరముగా నెంచునని వర్ణింపబడినది. అట్టి యజ్ఞాన మతనిలో నేల కలుగును? దానికి కారణము ధనాభి లాష. అతనికా ధనవాంఛ యేల కలుగును? అతడు 'దేవ పీయుడు.' దేవపీయు డనగా నేమి? ఈశబ్దము ముందు మంత్రములలోను ప్రయోగింపబడినది. పదమూడవ మంత్ర మునగల శబ్దములో నిది ముఖ్యము. దేవపీయుడనగా దేవత లను హింసించువాడని యర్థము. తన రాజ్యమున తనశాసన మున దైవభావములను నశింపజేయురాజు దేవపీయుడనబడును. దేవాధిదేవుడగు పరమేశ్వరుడు తన అగ్నివాయ్వాదిశక్తుల - దేవత లతో నీజగత్తును పూర్ణముగ శాసించుచున్నాడు. పరమేశ్వరుని

రాజ్యమున పదాధికారులగు అగ్ని మున్నగుదేవతలు అనుల్లం ఘనీయములగు నియమములకు కట్టువడి జగత్తును శాసించు నట్లు ఏమనుష్యరాజుయొక్క రాజ్యమున నానియమములు యశథాశక్తి అనుసరింపబడునో ఆశాసనము దైవశాసన మన బడును. కాని, రాజు తన కర్తవ్యమును విడిచి స్వార్థపరు డగుచో నారాజు రాజ్యమున దైవభావము చంపబడును; అసుర భావము పెంపొందును. ఇట్టి రాజునే వేదము దేవపీయుడను చున్నది. తన కర్తవ్యమును విడిచి ప్రజలను పీడించు స్వార్థ పరుడగు రాజుపేరు దేవపీయుడని సారము.

ఇట్టి స్వార్థపరుడు, ప్రజలవిషయమున తన కర్తవ్య మును గుర్తింపనివాడు, ప్రజల విషయమున ధ్యానముంచని వాడు నైనరాజు అక్షద్రుగ్ధు డనబడును. అతడు విలాసియు, విషయాసక్తుడు నగును. విషయాసక్తిని పూర్తిజేయుటకు సాధనమగు ధనము నభిలషించును. ఆయభిలాష పెరిగి యంధుడై మోహితుడగును. తదుపరి గీతలో జెప్పినట్లు స్మృతి భ్రష్టుడై బ్రాహ్మణుని దుర్బలుడని యెంచును. అతనిని తిని వేయుట – నశింపజేయుట సులభము, నిరాపదయు నని యెంచును.

అట్టివాని యాంతరిక యవస్థనే యీమంత్రము వర్ణించి నది. ఇంద్రుడతని హృదయమున నగ్నిని రగుల్పజేయును. ఆకాశము పృథివి రెండును నతని ద్వేషించును. అతడొంట రిగా నున్నపుడు అతనియందు జ్వలింపజేయబడిన అగ్ని యత నిని తపింపజేయును. అతడు లోకులతో కలిసి వ్యవహరించు

నపుడు ఎల్లరు నతనిని నిందించుచుందురు. ఇట్లతడొంటరిగా నున్నప్పుడు, కార్యవ్యగ్రుడైనపుడు ఎల్లప్పుడు నశాంతి ననుభవించును. ఒంటరిగా నున్నపుడు చింతాగ్ని యతనిని జ్వలింపజేయును, దానిని తప్పుకొనుటకు కార్యవ్యాపృతుడై జనుల మధ్యకు వచ్చిన వారతనిని నిందింతురు. లోకులతని సేవగించుకొందురు. ఇట్లతనికి లోపల వెలుపల నెక్కడను శాంతి లభింపదు.

వాస్తవమున నతనిలోపలనున్న దానిఛాయయే వెలుపల గనిపించును. హృదయమున నంతయు నుండును. ఆత్మపరమాత్మలకు హృదయమే స్థానము. అందువలననే యీమంత్రమున లోపల ఇంద్రుడు అగ్నిని జ్వలింపజేయును అనియు, ఆత్మకాక మిగిలిన అనాత్మప్రపంచము - పృథివ్యాకాశములు రెండును నతనిని ద్వేషించుననియు వర్ణింపబడినది. కావున నట్టిరాజుయొక్క సంస్కరణముకూడ లోపలినుండియే జరుగవలెను. అందువలననే యతనిహృదయమున నతనియాత్మ-పరమేశ్వరుడు పశ్చాత్తాపరూపదుఃఖాగ్నిని రగుల్పజేయును. దానివలన నతడు పీడితుడై-తపించి ఆత్మరాజ్యమహిమ నెఱుంగసాగును. తనలో దేవరాజ్యమును స్థాపించుకొనును. తనను ద్వేషించు బాహ్యజగత్తును జూచియు నతడు దేవపీయుడగుటకు బదులు దేవబంధువగుటకు ప్రయత్నింపవలెను. తన క్షుద్రస్వార్థమును విడిచి ప్రజలను పాలించుకర్తవ్యమునందే తనస్వార్థమును గుర్తింపవలెను.

ఈమంత్రమున నట్టిరాజును ప్రజాపీయుడనుటకు బదులు దేవపీయుడని చెప్పబడినది. ప్రజలందఱు నతనివి ద్వేషింతురు. ఆప్రజాస్థానమున రెండులోకముల దేవతలెల్లరు నతనిని ద్వేషింతురు. అనివర్ణింపబడినది. సర్వజగత్తును దేవమయముగా జూచుట వేదశైలి. వైదికవాయుమండలమున నుండువాని కంతటను దేవభావన కలుగును. ప్రజలలో నుండువారెల్లరు దేవతలని యారాజెంచవలెను. ఈప్రజాదేవతను 'పంచజన' నామముతో వేదము స్తుతించును. కావున ప్రజాద్రోహి దేవద్రోహి యగుచున్నాడు. ప్రజను పీడించురాజు ప్రజారూపదేవతవిషయముననేకాక పరమాత్మవిషయమునను పాపము చేయును. అందువలననే వేదమతనిని ప్రజాపీయుడనక దేవపీయుడనినది. దేవతలు బ్రాహ్మణవాణిని రాజునకిచ్చినట్లు ప్రజలనుకూడ పాలనచేయుటకు దేవతయే-పరమాత్మయే యారాజునకిచ్చెను. కావున నియ్యది ప్రజాదేవతను పీడించుటయేకాక పరమాత్మను పీడించుటయు నగునని తెలిసికొననలెను.

ఉపర్యుక్తబ్రాహ్మణునకు ప్రజ యనుకూలమగునని చెప్పుటయే కాక దేవతలెల్లరు నతని కనుకూలురగుదురని రానున్నమంత్రమున చెప్పబడును. ఆదేవతల యానుకూల్యము కారణముగ బ్రాహ్మణుడు దుర్బలుడుకాని మృదువుకాని కాడు. దేవపీయు డతనిని దుర్బలుడని యెంచుట యవివేకమగును. బ్రాహ్మణుడు దేవతలశక్తికారణముగ సురక్షితుడై యుండును.

బ్రాహ్మణుడు స్వయ మగ్నిరూపుడు

సర్వదేవతలు నతనికి సహాయకులు.

"న బ్రాహ్మణో హింసితవ్యోఽగ్నిః ప్రియతనో రివ
సోమోహ్యస్య దాయాద ఇంద్రో అస్యాభిశస్తిపాః" ౬.

ప్రియతనోః=ప్రియమైన శరీరముయొక్క, అగ్నిః ఇవ= అగ్నివలె, బ్రాహ్మణః న హింసితవ్యః=బ్రాహ్మణుడు హింసింప దగినవాడు కాడు. అస్య=ఇతనికి-బ్రాహ్మణునకు, సోమః హి= సోమరూపజగదీశ్వరుడే, దాయాదః=సంబంధియై యున్నాడు, ఇంద్రః=ఇంద్రరూపపరమేశ్వరుడు, అభిశస్తిపాః=హింసనుండి రక్షించువాడై యున్నాడు.

బ్రాహ్మణుని హింసించుట ఆత్మహననమగును. అంద అకు తన శరీరము ప్రియమగును. శరీరమునందలి యుష్ణత, ప్రాణము, జీవనము నన్నియు శరీరమును ప్రియమొనర్చును. ఉష్ణత నశించిన శరీరము శవమగును. శరీరాగ్నిని నశింప జేయుట ఆత్మహననమైనట్లు బ్రాహ్మణుని చంపుట రాష్ట్రి యాత్మను హననముచేయుట యగును. బ్రాహ్మణుడు ప్రియ మైన రాష్ట్రశరీరమునకు అగ్ని.

ఈమంత్రమున బ్రాహ్మణు డగ్ని యని మొదట చెప్ప బడినది. వైదికసాహిత్యమున బ్రాహ్మణున కగ్నితోగల సంబం ధము సుప్రసిద్ధము. దేవతల వర్ణవిభాగమున అగ్నిదేవత బ్రాహ్మణుడని చెప్పబడినది. ఆధ్యాత్మికక్షేత్రమున అగ్ని వాక్కు (అగ్నిర్ వాగ్ భూత్వా ముఖం ప్రావిశత్). ఇట్లు అగ్ని, బ్రాహ్మ

ణుడు, వాక్కు మూడును పరస్పరసంబద్ధములై యేకముగా వైదికసాహిత్యమున నంగీకరింపబడుట చూడనగును. శరీరాగ్నిని నశింపజేయుటవలె బ్రాహ్మణనాశము ఆత్మహననమగునని పైవాక్యముల తాత్పర్యము.

సోముడు బ్రాహ్మణునకు దాయాదుడనియు, ఇంద్రుడు అతనిని హింసనుండి రక్షించువాడనియు ఈమంత్రము-ఉత్తరార్ధమున చెప్పబడినది. కావున బ్రాహ్మణుడు దుర్బలుడు, అసహాయుడు నని యెంచరాదు. ఇతని కిరువురు పెద్దదేవతలు సహచరులు. సోముడు, ఇంద్రుడు నను నీరెండునామములు పరమాత్మునివే. అది పరమేశ్వరుని భిన్నశక్తులకు ద్యోతకములు. జగత్తున కేకైకరాజగు పరమేశ్వరుడు రెండురూపములతో బ్రాహ్మణరక్షకు డగుచున్నాడని భావము. సోమ, ఇంద్రశబ్దములు పరమేశ్వరుని యేశక్తులను తెలుపును? వానికి అగ్నితో దాయాద, రక్షకసంబంధము లెందుకు కలిగినవి తెలిసికొనుట బుద్ధిమంతుల కావశ్యకము.

ఈసూక్తమున అగ్ని, సోమ, ఇంద్ర దేవతల నామములు రెండు మూడు తావులందు కననగును. ఈజగత్తున పరమేశ్వరుని మూడు ప్రధానశక్తులు పనిచేయుచున్నవి. వానిని దృష్టియందుంచుకొని మూడునామములతో మూడు దేవతలరూపమున పరమేశ్వరుడే యీసూక్తమున జూడనగును. ఈమూటియందే మిగిలిన దేవతలన్నియు సమావిష్టములగును.

| బ్రహ్మ | | క్షత్రము |
|---|---|---|
| 1. అగ్ని<br>అగ్రణీః భవతి | - సోముడు<br>- సునోతి ధాతువుతో | ఇంద్రుడు<br>శత్రువిదారకుడు |
| 2. ఉన్నతి-వృద్ధి | - స్థిరత-పుష్టి | రక్షణ-శత్రు నాశనము |
| 3. బ్రహ్మ-ఉత్పత్తి | - విష్ణువు-స్థితి | మహేశుడు-సంహారము |
| 4. Progress | - Permanance | Protection |
| 5. Legislature<br>వ్యవస్థ | - Judicial<br>- న్యాయము | Executive<br>శాసనము |
| 6. పింగళా | - ఇడా | సుషుమ్న |
| 7. పిత్తము | - కఫము | వాతము |
| 8. నాభి | - శిరస్సు | హృదయము |

ఈ కోష్ఠకమున మొదటి మూడు సంఖ్యలు ఈదేవతల సామాన్యసంబంధమును తెలుపును. 4, 5 సంఖ్యలలో మూడు దేవతలు ఆధిభౌతికక్షేత్రమున (సమాజమున - రాష్ట్రమున) ప్రకటమగు విశేషరూపమొకటి చూపబడినది. 6, 7, 8 సంఖ్యలు వ్యక్తిశరీరమున నీదేవతలరూపమును జూపును.

ప్రథమమున అగ్నిసోముల సంబంధము తెలిసికొందము. అగ్నిసోముల ద్వంద్వము జగత్తున ప్రసిద్ధము. అగ్ని ఉన్నతికి వృద్ధికి ద్యోతకము. అగ్నివలన ఉన్నతము, వృద్ధము నైన దానిని స్థిరపఱచి పుష్టముచేయుట సోముని కార్యము. అగ్ని అగ్రణి-ముందునడపునది. సోముడందులో రసమునునింపును.

కేవలాగ్నికాని, కేవలసోముడుకాని కార్యకాములు కావు. ఇవి రెండును కలిసి జీవనమును నడుపును. ఇవి యొకదానికి మఱియొకటి పూరకములు. ఉన్నతియు కలుగవలెను. అది స్థిరము కావలయును. అగ్నివలన కలిగిన వృద్ధిని సోముడు పుష్టిచేయును. కావున అగ్నికి సోముడు దాయాదుడయ్యెను. "దాయామ్ ఆదత్తే ఇతి దాయాదః" 'అగ్ని యిచ్చిన దాయమును సోముడు గ్రహించును. ఇది దీనికిగల దాయాదసంబంధము.

తత్త్వవేత్తయగుమిల్ మహోదయుడు శాసనముయొక్క ఉద్దేశము Progress and Permanance వృద్ధి, స్థిరతయని రెండుశబ్దములలో చెప్పియున్నాడు. రాష్ట్రము నున్నతము చేయుట దానిస్థిరపఱచి పరిపుష్టముచేయుట అను నీరెండు విషయములు అంతరిక శ్రేయస్సును తెలుపును. బాహ్య జగత్తు లేనిపక్షమున నీరెండు విషయములలో సమస్త-ఉద్దేశ్యము నెఱవేఱును. కాని అట్లుకాదు. ఆంతరికమగు నున్నతిలో వెలుపలనుండి బాధ కలుగవచ్చును. కావున ఈరెంటితో బాటు 'మిల్' Protection 'రక్షణ' ను కూడ జోడించును. మొదట రెండును కలిసి యొకటియగును. అనగా 'అగ్నిసోములు' ఒకటి. దానితో ఇంద్రుడు కలిసి మఱియొక ద్వంద్వమేర్పడును. ఈద్వంద్వమును నేటి రాష్ట్రసంబద్ధభాషలో Civil & Military చట్టము శాసనము అనిచెప్పవచ్చును. వేదమున వీనినే బ్రహ్మము, క్షత్రము లందురు. బ్రహ్మమున వ్యవస్థ (Progress), న్యాయము, (Permanance) రెండును వచ్చును. ఇక ఇంద్రశబ్దమున కర్థము. (ఇందన్ శత్రూణాం

దారయితా- యాస్కముని) ఐశ్వర్యమును కలిగించుచు శత్రువుల నాశనమొనర్చువాడు ఇంద్రదేవత. వ్యవస్థనొనర్చువాడు (Legislature) బ్రాహ్మణుడు. అతనికి రాష్ట్రమున న్యాయము జరుగుచున్నపక్షమున స్థిరత యేర్పడును. వ్యవస్థ రాష్ట్రమున స్థిరపడును. కాని, మనుష్యునిలో నొకవిశేషతత్త్వము కూడ నుండెను. దానివలన నతడు తాను నిర్మించుకొనిన నియమములను పాలించుటలో వానికి న్యాయము చేకూర్చుటకు స్వయముగా ప్రవృత్తుడు కాడు. వానిని విరోధించుటకును సిద్ధమగును. కావున న్యాయమును కార్యాన్వితమొనర్చుటకు ఇంద్ర - క్షత్రము (Executive) న కావశ్యకమగును.

జగత్తున నీమూడుదేవతలు-పౌరాణికులలో ప్రసిద్ధములైన బ్రహ్మ, విష్ణువు, మహాదేవుడు త్రిమూర్తులు కావచ్చును.

ఈమంత్రమున 'ప్రియతనోరివ' అని వ్యక్తిశరీరము ఉపమానముగా చెప్పబడినది. కావున అధ్యాత్మికమునందును నీమూడు దేవతలరూప మెట్టిదో తెలిసికొనుట యుచితమగును. యోగవిజ్ఞానము ననుసరించి మనశరీరమున కుడివైపున 'పింగళ' అనునాడి యొకటి యున్నది. దానిని సూర్యనాడి యనియు నందురు. అది యున్నతియందును, గతియందును ప్రభావము కలిగించును. వామభాగమున ఇడా అనునాడి యున్నది. దీనిని చంద్రనాడి యనియు నందురు. ఇది స్థిరతను కలిగించును. ఈరెండునాడులమధ్య రెండింటిని కలుపుచు 'సుషుమ్న' యనునాడి మూడవది యున్నది. ఇది యగ్నినాడి యనబడును.

ఇట్లే ఆయుర్వేదదృష్టితో పిత్తకఫములద్వంద్వము వీనిని నడపునట్టి వాతము శరీరమున నుండుట ప్రసిద్ధము. ఈవిధముగ శరీరమునందును అగ్నిసోములు ఇంద్రుడు నను దేవతలు పనిచేయుచున్నట్లు తెలియుచున్నది. అగ్ని శరీరమున జీవనము కలిగించును. ఉష్ణతరూపమున ప్రాణము జీవనము నొసంగును. సోముడు రసము నుత్పన్నముచేయుచు నాయుష్ణతను సమముగనుంచి జీవనమును, శరీరమున స్థిరముగా నుంచును. ఇంద్రుడాజీవనమును రక్షించును. శరీరమును వ్యాధులతో సంఘర్షణ చేయించుశక్తి ఇంద్రశక్తి యనబడును. చివరి క్షణమువఱకు రోగములను దూరముగ నుంచుటకు ప్రయత్నించు శరీరస్వభావ మియ్యదియే. యోగవిజ్ఞానము ననుసరించి అగ్ని నాభియందుండును. ఇదియే వాణికి మూలస్థానము కూడ. పైన శిరస్సునందు అధోముఖముగ సోముడుండును. ఇవి రెండును పరస్పరము క్రియ, ప్రతిక్రియలు నడుపుచుండును. ఈరెంటిమధ్యలో శరీరమధ్యస్థానమున ఇంద్రుడుండును, ఇతడు సర్వశరీరకార్యములను నడుపుచుండును. అందువలననే గతమంత్రమున ఇంద్రుడు హృదయమునఅగ్నిని రగుల్పజేయునని చెప్పబడినది. హృదయ మింద్రునిస్థానము. దండించి సంస్కరించుట యతనిపని.

పదమూడవమంత్రమున వీనినిగూర్చి తెలిసికొనుటకు వీలుగా నీమూడుదేవతలగూర్చి విస్తారముగ నిటవ్రాయబడినది.

---

8)

మ్రింగును కాని జీర్ణము చేసికొనలేడు.

"శతాపాష్ఠాం నిగరతి తాం న శక్నోతి నిఃఖిదన్
అన్నం యో బ్రహ్మణానాం మల్వః స్వాద్వద్మీతిమన్యతే" ౭.

[యః మల్వః=ఏరాజు తనధారణ-శక్తిని అభిమానించునో, బ్రహ్మణానాం అన్నం స్వాదు అద్మి ఇతి మన్యతే=బ్రాహ్మణులను కష్టపెట్టుచు నేను రుచిగల అన్నమును తినుచున్నానని యెంచునో, యతడు, శతాపాష్ఠాం=వందలకొలది యాపదలతో నిండినవస్తువును, నిగిరతి=మ్రింగును, కాని, నిఃఖిదన్ న శక్నోతి=దానిని జీర్ణింప జేసికొనజాలడు.]

'దేనినైన ధరించగలను, దేనినైన హరించుకొనగలను., అని యభిమానపడు రాజు బ్రాహ్మణుని దుఃఖములపాలుచేయ యత్నించును. అందులో నతడు సుఖింపజూచును. కాని, వేదమతనికిట్లు చెప్పుచున్నది. బ్రాహ్మణుని కష్టపెట్టుట రుచికరమగు భోజన మెన్నడును కాదు. పైపెచ్చు వందలాది యాపదల సమూహమగును. మ్రింగుటలో నది రుచికరముగా కనిపించినను పొట్టలో చేరి యది జీర్ణము కాదు. ఎన్నియో యుపద్రవముల నది కలిగించును.

రాజు తానెంత ధారణశక్తి గలవాడయినను బ్రాహ్మణుని కష్టపెట్టి జీర్ణము చేసికొనజాలడు. కొండొకడు జిహ్వకు స్వాదును గలిగించు అభక్ష్యపదార్థమును భుజించునేని యది యుదరమున జేరి యుదరశూలను కలిగించును. అందుకు తీవ్రమగు నౌషధములను సేవించిన నది పుండ్లుగా-వ్రణము

లుగా బయటకి పొక్కును. వాంతులు, విరేచనములు నగును. ఇంకను ఏమేమో వికారము కలుగును.అట్లే నిస్స్వార్థ సచ్ఛీల బ్రాహ్మణుని కష్టపెట్టుటయు రాజున కాపదలు కలిగించును. స్వయముగా బ్రాహ్మణుడు తాను రాజు నెదిరింపడు. అతడు పెట్టుబాధలన్నియు మెదలకుండ సహించును. ఈసహనము రాజున కానందము కలిగింపవచ్చును. కాని నిరీహ బ్రాహ్మణుని బాధలకు గురిచేయుట జూచి, యాబ్రాహ్మణుని బలిదానమును గుర్తించి దేశమున నుత్తేజన వ్యాపించును. నానావిధములగు నుపద్రవము లుప్పతిల్లును. రాజునకు వాని నెదుర్కొనుట ప్రాణసంకటమగును. ప్రజలు ఉత్తేజితులైనపుడు రాజ్యమున వాటిల్లు కష్టనష్టములకు మేర యుండదు. రాజ్యమున నరాజకత యేర్పడును.

ఈయుపద్రవముల నారాజెట్లు జీర్ణము చేసికొనగలడు? జీర్ణింపజేయగల బ్రాహ్మణరూపాగ్నినే యతడు నాశము చేసికొనెను. పూర్వమంత్రమున రాష్ట్రరూపశరీరమున అగ్ని బ్రాహ్మణుడని వర్ణింపబడినది. జాఠరాగ్ని నశించినమీదట అన్నమెట్లు జీర్ణించును? వాస్తవమేమన రాజ్యమున నేర్పడు ఉపద్రవములను రాజు ప్రజాబలముతో నణచగలడు. ప్రజల సహకారముతో రాజు రాష్ట్రమున నెన్నియో గొప్పమార్పులు చేయగలడు. ప్రజలసహకారమును రాజునకు చేకూర్చునది బ్రాహ్మణవాణి. అదియే అగ్ని. దానిసహాయముతోనే రాజు గొప్పకఠోరకృత్యములను జేసియు వానిని జీర్ణింప జేసికొన గలడు. రాష్ట్రమున నెట్టియాందోళనముకూడ ప్రజ్వరిల్లకుండ

చేయగలడు. ప్రజలను కఠినశాసనమున క్రమశిక్షణలో నుంచి శీఘ్రముగ రాష్ట్రము నున్నతశిఖరమున చేర్పగలడు. కాని ఆయగ్నిని నశింపజేసిన రాజుగతి యేమి కాగలదు ?



## బ్రాహ్మణుడే వింటితో దేవపీయుని నశింపజేయును.

"జిహ్వా జ్యా భవతి కుల్మలం వాజ్
నాడీకా దన్తా స్తపసాభిదిగ్ధాః,
తేభిర్ బ్రహ్మ విధ్యతి దేవపీయూన్
హృద్బలైర్ ధనుభిర్ దేవజూతైః" ౮.

[జిహ్వా జ్యా భవతి=నాలుక వింటినారి యగును, వాక్ కుల్మలం=వాణి బాణదండమగును, నాడీకాః దన్తాః=నాడులు జ్ఞానతంతువులు బాణాగ్రములగును. అవి తపసా అభిదిగ్ధాః= తపస్స్వరూప-అగ్నితో పదునుబెట్టబడును, తేభిః=అట్టి, దేవ జూతైః = దేవతలచే ప్రేరితములైన, హృద్బలైః ధనుభిః= హృదయబలమనెడి ధనుస్సులతో, బ్రహ్మ = బ్రాహ్మణుడు- ప్రజానాయకుడు, దేవపీయూన్=దేవపీడకులను - ప్రజానాశకు లను-రాజ్యాధికారులను, విధ్యతి=వేధించును.]

ఈమంత్రసూక్తమున ముఖ్యమైనది, విశేషముగ మనన ము చేయదగినది, పీడితప్రజల యస్త్రమిట వర్ణింపబడినది. ఈధనుస్స్వరూపము బాగుగ నెఱుగదగియున్నది. ఈధనువు బ్రాహ్మణ-వాణియే.

ఇందు నాలుక వింటినారి. దానినుండి వెలువడు శబ్దములు బాణములు. ఆబాణాగ్రములు దంతములు - ప్రాణ నాడులు. బాణాగ్రములు సాధారణముగ విషదిగ్ధములు-విష లిప్తములై యుండును. లేక అగ్నియందు తపింపజేసి పదును పెట్టబడి యుండును. అట్లే వాణిరూపధనుస్సుయొక్క బాణాగ్రములుతపస్సు-కష్టసహనముతో పదును పెట్టబడియుండును. ఇక ధనుర్దండమో యది హృదయబలముగా నెంచవలెను. ఈధనుస్సు బ్రాహ్మణుని హృదయమందుండు దేవునిచే ప్రేరితమై నడపబడును. ఈధనుస్సుతోనే ప్రజానాయకుడను బ్రాహ్మణుడు ప్రజలకు ద్రోహముచేయు దేవపీయువులను-రాజ్యాధికారులను వేధించును-కొట్టును.

## వాణి స్వరూపము

'నాలుకతో శబ్దము లుచ్చరింపబడును. ఇది వాణిస్వరూపము. వాక్కుతో మనము మనజ్ఞానమును ఇతరులకు చేర్చెదము. అని సాధారణముగ తెలియుచున్నది. కాని వాస్తవమున వాణి యింతకంటెను గంభీరమైనదనియు విశాలమైనదనియు తెలియనగును. వేదమున 'వాక్కు,' సంస్కృతమున 'వాణి' శబ్దములు గంభీరము, వ్యాపకమునగు నర్థములను బోధించును.

మొదట గభీరతనుగూర్చి విచారింతము. వాణి నాలుకతో ప్రారంభము కాదు. దానిమూలము మూలాధారముననున్నది. నాలుకయందు వాణియొక్క స్థూలత, పరిమితతమరూపము

ప్రకటమగును. నాలుకవఱకు చేరునప్పటికి వాణి నాలుగడుగులు వేసి పరిమితమై యుండును. వాణి యీ క్రిందవర్ణించినట్లు నాలుగడుగులు క్రమముల-మూలమున తనస్థూలరూపమును బొందును. అందువలననే వాణి 'చతుష్పదా' చతుష్పద యనబడును. దీనిప్రతిపదమును ఋషులు భిన్ననామముతో వర్ణించినారు, మూలాధారమున నుండువాణి 'పరా' అనబడును. ఈవాణియందు జ్ఞానమున కాకారముకాని, ప్రకారముకాని ఉండదు. కావున నట జ్ఞానములన్నియు అపరిమితములై సామాన్యరూపమున-నిరాకారరూపమున నిర్విశేషములై యుండును. ఒక్కయడుగు ముందుకువేసిన మీదట జ్ఞానమున కొకప్రకార మేర్పడును. అది సామాన్యముకాక విశేషమగును. కాని దానికొక యాకారమేమియు నేర్పడదు. ఈస్థితిలో వాణి 'పశ్యన్తీ' అనబడును. దీనిస్థానము నాభి. మూడవయడుగున నీవాణి హృదయమున జేరును. ఇక్కడ నిది 'మధ్యమా' అనబడును. లేక మానసవాణి యనియు పిలువబడును. ఇక్కడ జ్ఞానమొకవిధమగు నాకారముతో పరిమితమగును. అనగా జ్ఞానము భాషకుసంబంధించిన సూక్ష్మశరీరమును ధరించును. మనస్సునందు విచారించునపుడు భాషను ప్రయోగింపదొడగుదుము. మనస్సునందు శబ్దములు పదములు వాక్యములు సిద్ధమగును. అప్పుడయ్యవి యుచ్చస్వరమున - ధ్వనిలోనుండవు. కాని మనస్సులోనే నతివేగముగా నుచ్చరింపబడును. ఇక్కడ మనము శబ్దసంకేతమునుపయోగింప ప్రారంభింతుము. మొదటిరెండువాణులు (పరా, పశ్యన్తి) ఆకారము లేనివిగా నుండును. కావున వానిరూపమును బాగుగ మనమెఱుగజాలము. కాని యీమూడవవాణి 'మధ్యమావాణీ'ని మన

మెఱుగగలము. వేదమున నీవాణినిగూర్చి యెక్కువగ విచారించియుండుట చూడనగును. దీనితరువాత నాలుగవ వాణి 'వైఖరీ' అనబడును. ఇది ప్రసిద్ధవాణి. నాలుకమూలమున ధ్వనిరూపమున పలుకబడును. వాణి-మూలము హృదయమున నున్నదని సులభముగ తెలిసికొనగలము. హృదయముననే మొదట ఆలోచన కలుగును; తదుపరి దానిని నాలుకతో పలుకుదుమని మనమెఱుగుదుము. కాని, నిజముగ వాణి-స్థానము హృదయమునకాక చాలక్రింద మూలాధారముననున్నది. సర్వ వాక్కులు నటనుండియే బయలుదేరును. అటనే వాణియొక్క మూలము-వేఱు దృఢముగా నాటుకొని యున్నది. ఇయ్యది వాణియొక్క గభీరత-లోతు.

ఇక వాణియొక్క విస్తారమునుగూర్చి తెలిసికొందము. వాక్కు శబ్దోచ్చారణమాత్రము కాదు. శబ్దసంకేతము-భాష యొక్క యుపయోగము మాటలాడుటలోనే కాక వ్రాయుటను చేయుదుము. లిపి, ముద్రణ అనువానిని కనుగొనినమీదట వాణిక్షేత్రము మిక్కిలి విశాలమైనది. చెప్పినదియే కాక వ్రాసినదియు వాణియే. వ్రాతలోను అక్షరములేకాక అన్నియాలోచనలు, చిత్రములు వ్యంగ్యచిత్రములు నన్నియు వాణియే. అట్లే చెప్పుటలోను వర్ణముల నుచ్చరించుటయే కాదు; నవ్వుట, ఏడ్చుట, పాట, వాయించుట, ఈలవేయుట అన్నియు వాణియే యగును. ధ్వనిజసంకేతములు, నృత్యము, వ్యాఖ్యాతయొక్క హస్తసంచాలనములు, ప్రదర్శనములు అన్నియు వాణియే, అభిప్రాయప్రకటనలు అన్నియు వాణియే. ఒక్కొక్కయెడ మౌనము వహించుటయు గొప్పవాణియే యగును. అందువల

నను గొప్పయభిప్రాయము ప్రకటమగును. ముఖాకృతులు మాఱుట, కంటిరంగు మాఱుటయు వాణిప్రయోజనమును సిద్ధింపజేయును. మౌనము వహించి యొకపని చేయుటయు వాణియే యగును.

పూర్వులు వెనుకటి వాణులను సంగ్రహించుటకు తమలోని స్మృతిశక్తి నుపయోగించెడివారు. వేదవేదాంగములిట్లే రక్షింపబడినవి. నేడు ముద్రణాలయముల ద్వారమున వాణిని స్థిరపఱచుచున్నాము. గ్రామఫోనులతో ధ్వనిమయవాణిని స్థిరపఱచుచున్నాము. ఇట్లే వాణి నొకస్థలమునుండి మఱియొక తావునకు చేర్చుటకు టెలిఫోనులు, తీగలు మున్నగువానిని కనిపెట్టి వాణియుపయోగము నెంతగానో ప్రచారము చేయుచున్నాము. పత్రపత్రికలరూపమున విజ్ఞాపన వ్యాపారమెంతగానో పెరిగిపోయినది.

## వాణియొక్క శక్తి

కాని, నేటి యీ వాణీవిస్తృతివలన దానిశక్తి పెరిగినదనరాదు. విపరీతముగ తగ్గినదనియే యనవలయును. వాణిశక్తి యెట్టిది? యెంత? అనువిషయమే నేడు మనము విస్మరించితిమి. కావున దీనిశక్తిని సరిగా నెఱుగవలసియున్నది. అప్పుడే దాని అస్త్రత్వము నెఱుగగలము. నేడు వాణిని విస్తరింపజేయుటలో దాని సామర్థ్యమున్నదని యెంచుచున్నారు. తన శత్రువునకు విరుద్ధముగా ప్రచారముచేయుట యొకపెద్ద అస్త్రమనుకొనుచున్నారు. వాస్తవమున వాణియొక్క గభీరతలో

నున్న సామర్థ్యముముందు విస్తారబలమొకింతయు పనికిరాదు. ఆకర్ణాంతము లాగి విడిచిన బాణమెక్కుడుదూరమువఱకు ప్రహారము చేయగలుగునట్లు గభీరత-లోతులనుండి బయలు వెడలిన వాణి యెక్కువప్రభావము కలిగియుండును. 'ఆమాట లతనిహృదయాంతస్తలమునుండి వెలువడినవి' అని మనమని నపుడు సత్యముతోగూడిన శబ్దములలో బలమెక్కువగా నున్న దని యంగీకరించినవార మగుదుము. హృదయగభీరత సత్య మునకు మించి మఱియొండుకాదు. హృదయ మెంతశుద్ధము, సత్యముతో గూడినదగునో యది యంత యెక్కువ బలము కలది యగును. ఈమంత్రమున హృదయము ధనువుగా వర్ణిం పబడినది. దాని యభిప్రాయము-సత్యము శుద్ధమునైన హృద యమని. ఈ గభీరతలోను మఱియొక భావమున్నట్లు మన మంగీకరింతుము. 'ఇది యతనియాత్మనుండి వచ్చిన ధ్వని' యని మనమందుము. అనగా మానసికవాణిని హృదయము వఱకు మనమంగీకరించుచున్నాము. కాని నాభి మూలాధారము లకు సంబంధించిన 'పశ్యన్తీ, పరా' వాణిని సాధారణజనులు గుర్తింపజాలరు. కాని యీశుద్ధత, సత్యతలను మనమనస్సు లందు మిక్కిలిగా సంపాదింతుమేని నాభినుండి వెలువడిన 'పశ్యన్తీ' వాణిని, మూలాధారమునుండి వచ్చిన 'పరా' వాణిని కూడ గుర్తింపగలుగుదుము. ఇదియే సత్యమైన యాత్మకు చెందిన వాణి యగును. ఈ మంత్రమున ఇదియే "దేవజూతైః" శబ్దముతో చెప్పబడినది. ఈవాణియే దేవతలచే ప్రేరితమైనది, పశ్యన్తీ' నుండి వెలువడినది. పరమదేవుడగు పరమేశ్వరు నిచే ప్రేరితమగువాణి 'పరా' వాణి యగును. ఇట దేవశబ్దము

దేవతావాచకము. అంతమున పరమాత్మయొక్కడే పరదేవత యగును. మనవాణి 'పశ్యన్తి' లేక 'పరా' యేదైనను కావచ్చును. కాని దానికి సాధనమైన హృదయము సత్యముతో కూడి శుద్ధమై యుండవలెను, అసత్యము లవలేశముకూడనుండరాదు.

"సత్యేన పన్థా వితతో దేవయానః."

దేవతల గమనమార్గము (సత్యేన) సత్యముతో నేర్పడి యున్నది. కావున హృదయమున దేవతలను నివసింపజేయదలతుమేని-దేవయానపథికులము కాగోరుదుమేని, సత్యమును సేవింపవలసి యుందుము. అప్పుడే మనవాణి 'పశ్యన్తి' 'పరా' స్థానములనుండి వెలువడును. సత్యము కేవలసత్యము. వాణిశక్తి యంతయు సత్యమునందే నిహితమై యున్నది. వాణియొక్క నిజమైనశక్తి పతంజలిముని యెఱుగును. కావుననే యతడు "సత్యప్రతిష్ఠాయాం క్రియా ఫలాశ్రయత్వమ్" అని సూత్రించినాడు. వ్యాసమునికూడ ఎఱుగును. అతడీ యోగసూత్రార్థమును వివరించుచు "తనహృదయమున సత్యమును ప్రతిష్ఠించుకొనిన మనుజునివాణి యేది పలికిన నది పూర్ణమగు"నని దానిసామర్థ్యమును వర్ణించియున్నాడు.

"ధార్మికో భూయా ఇతి భవతి ధార్మికః స్వర్గం ప్రాప్నుహీతి స్వర్గం ప్రాప్నోతి, అమోఘాఽస్య వాగ్ భవతీతి." సత్యప్రతిష్ఠగల వ్యక్తి యొకనిని నీవు ధార్మికుడవు కమ్ము" అనిన ధార్మికుడగును.'నీవుస్వర్గమును బొందుము'అని యనిన నతడు స్వర్గమును పొందును. అనగా నతని వాక్యము అమోఘము

తప్పక ఫలించును - అతడేదియనిన నది కాకమానదని భావము.

మనలో నసత్యమెక్కుడుగా చేరియున్నది. కావున వ్యాస, పతంజలి మున్నగువారి వచనములను కూడ నమ్మజాలకున్నాము. కాని మనము సత్యమును నమ్మనంతమాత్రమున సత్యమున కెట్టిహానియు కలుగదు. మనము సత్యమువంక దేవయానమార్గమున నడచెదమేని యీసత్యముయొక్క సత్యత తెలియగలదు. సత్యనిష్ఠగల గాంధిమహాత్ము డేమనుచున్నాడు. "భారతవర్షమున నేడొక్కడైన పూర్ణసత్యవాది యున్న అతడు నేడే భారతవర్షమునకు స్వరాజ్యము నిప్పింపగలడు. అతడేది చెప్పిన నతని వాక్శక్తి కారణముగ లోకులు దానిని అంగీకరింతురు." దీనింబట్టి గాంధి సత్యనిష్ఠుడు కావున పతంజలి వాక్యము నతడనుభవమునకు తెచ్చుకొనెనని యెంచవలెను. లేకున్న నట్లు చెప్పగలడా ?

కావున వాణియొక్కశక్తి దానిగభీరత-లోతుపై నాధారపడియున్నది. దేవప్రేరితమగుటలో నున్నది. ప్రచారమున లేదు. అసత్యప్రచారమున నసలే లేదు. ఈజగత్తుపై నంతిమ శాసనము పరమేశ్వరునందున్నదని మఱువరాదు. అతడు సత్యస్వరూపుడు. అతనిరాజ్యాధికారులైన 'అగ్ని' మున్నగు దేవతలు అచంచలసత్యమయనియమములతో జగత్తును పాలించుచున్నారు. వేదమున నీనియమములు ఋతశబ్దముతో చెప్పబడును. ఋతమున కర్థము సత్యమే. దేవతలను వేదమున ఋతావృధః సత్యమును వృద్ధిచేయువారు, 'ఋతావానః' = సత్యమయులు ననువిశేషణములతో వర్ణించుట చూడనగును.

కావున నీప్రపంచముపై సత్యమే రాజ్యము చేయుచున్నది. సత్యము నాశ్రయించువారికి బ్రహ్మాండాధిపతియొక్క యనంత శక్తి సహకారము లభించును. వారివెంట్రుకలనుగూడ నెవ్వరు నూడబెఱుకజాలరు. సత్యము నాశ్రయింపనివారు జగత్పతికి ద్రోహమొనర్చి ఋత-నియమముల నుల్లంఘించి సఫలతనెట్లు పొందగలరు? కావున నసత్యమువలన క్షణికసహాయము దొరుకుచున్నదని యెంచి భ్రమలో పడరాదు. అనుభవము కలిగిన మహర్షులవచనములను నమ్మవలెను. ఎల్లసమయములందును సత్పురుషులు సత్యమహిమను అనుభవించియే యున్నారు. సత్యవాణియెదుట ప్రచారము నిలువజాలదు.

వాణి జగత్తును చలింపజేయగల శక్తికలది. వాణి ప్రయోజనము ఇతరులవఱకు జ్ఞానమును, ఆలోచనలను జేర్చుటయే కాదు. వాస్తవమున శక్తిరూపజ్ఞానమును చేర్చుట యని చెప్పవచ్చును. జ్ఞానము-ఆలోచన, ప్రపంచమును నడపుగొప్ప శక్తి యనదగును. అట్టిశక్తి నొకచోటునుండి మఱియొక తావునకు చేర్చునది వాణియే. కావుననే వేదమునందలి 'వాగాంభృణీ' సూక్తమున పరమాత్మనిపరవాణి యిట్లనుచున్నది.

'నాయందే దేవతలన్నియు వసించియున్నవి. నేనన్నింటి పాలనపోషణ చేయుచున్నాను. నేనే సర్వజగత్తును కదలించుచున్నాను, నాయాశ్రయముననే యంతయు నడుచుచున్నది. సర్వజ్ఞానములను, సర్వకర్మలను నేనే ప్రేరేపించుచున్నాను.' ఋ. ౧౦. ౧౨౫.

ఇట్లు భగవంతుని పరవాణియే యంతయు చేయు చున్నది. సర్వమతములవారును శబ్దమువలన జగత్తు ఉత్పన్నమైనదని సూచించుటలో నభిప్రాయమిదియే. భగవంతుని శబ్దమున వచ్చిపోవునది యగుచుండును. ఇట్లే జగత్తు అయినది, నడచుచున్నది. వాస్తవమున మనమతనివాణిని తెలిసికొనజాలము. మనము మనవాణిలోగల రచనాశక్తిని చూచి భగవంతుని వాణిశక్తినిగూర్చియు కొంతకల్పన చేయవచ్చును. తామేయే సంకల్పములు చేయుదురో యవి సత్యము కాగల మహాత్ములు లోకమున నుందురను విషయమును మనము విశ్వసింపక పోవచ్చును. కాని అట్టివారు లేకపోరు. వారు మాటలాడుటకు తమజిహ్వను కదల్పవలసిన అవశ్యకముకూడ కలుగదు. వారు మధ్యమ (మానస) వాణినే ప్రయోగింతురు. వారిమనస్సున సంకల్పముదయించుటయే తడవుగ నది సిద్ధించును. ఇట్టి సత్యసంకల్పులైన మహాత్ములను వర్ణించుచు ఉపనిషత్తు చెప్పుచున్నది.

"స యది పితృలోకకామో భవతి

సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠన్తి" ఛాం-ఉ. 8-2-1

'అతడు పితృలోకము నభిలషించిన సంకల్పమాత్రముననే యతనికి పితృగణము ప్రాప్తించును. వాణికిగల యిట్టి యపారశక్తికి మనమెంతో దూరముగ నున్నాము. అసత్యమునందు నేదో యొకింత బలమున్నదని మనకు తోచుటకు కారణమిదియే.

సత్యమును పూర్తిగ గ్రహించుట మిక్కిలి కఠినమను టలో సందియము లేదు. కాని యెవడెంత సత్యమును గ్రహించునో యతడంతలోతునకు బోయి సత్యమయదేవతను సమీపించును. అతనివాణిలో నంతటి యమోఘతయు నుండును. దుర్లభులగు సత్యసంకల్పులైన మహాత్ముల యాత్మదేవత సత్యమయదేవతతో సంబద్ధమగును. వారి వాణి పరావాణి యెట నుండి బయలుదేరునో యటనుండియే వెలువడును. అందు వలననే యా వాణిప్రభావము ప్రకృతియొక్క పరసీమను చేరగలదు. అనగా వారివాణివలన తిన్నగా జడప్రకృతియందును పరివర్తన కలుగగలదు. పరతత్త్వముతో సంబంధము కలుగని యోగియు కొంతవఱకు సత్యమయుడగును. ఆతని వాణి 'పశ్యన్తి' తో సంబద్ధమగును. ఆతనివాణి నిమ్నశ్రేణికి చెందిన పశువులపై తనప్రభావమును చూపగలుగును. అతడు తనవాణిమూలమున పశువులలోను పరివర్తన తేగలడు. ఇక మూడవతరగతికి చెందినవారు తమహృదయమున నున్నదే బయటికి చెప్పుదురు. పూర్ణసత్యమును వారు తెలిసికొనజాలరు. కాని వారికెంత సత్యము తెలియునో యంతయే చెప్పుదురు. వారి వాణి హృదయమునుండి బయలుదేరును. అందువలన చేతనులగు మనుష్యుల హృదయములపై తనప్రభావమును జూపగలదు. ఇక మనవంటివారు ఈమూడవతరగతివారికి తరువాతివారమే. మనము స్థూలసత్యమునుగూడ పాలింపజాలము. హృదయమున నున్నదానినైనను పైకి చెప్పజాలము. మనవాణి హృదయమునుండి వెలువడక నాలుకనుండియే వెలువడునని భావము. కావుననే యది యితరమనుష్యుల

హృదయములలో కూడ ప్రవేశింపనేరదు. వారిచెవులవఱకే చేరును.

భాగుగ, రుచికరముగ మాటలాడువారు లోకమున పలువురు లభింతురు. వారిమాట లాసమయమున వినుటకింపుగానే యుండును. కాని యితరుల హృదయములందు స్థిరముగా నుండు ప్రభావము నేర్పఱపజాలవు. వక్తృత్వదృష్టితో జూచిన లోకమాన్యతిలక్ మంచిగా మాటలాడనేర్చినవారు కాదు. కాని వారిమాటలు ఇతరులహృదయమున బాణములవలె గ్రుచ్చుకొనెడివి; స్థిరమైన ప్రభావమును కలిగించెడివి.

ప్రస్తుతము జనులు మిక్కిలి యెక్కువ మాటలాడుదురు. ఇందులోనే వాణీశక్తి కలదని యెంచెదరు. కాని ఎక్కువ మాటలాడుటలో ప్రభావముండదు. లోపలినుండి మాటలాడుటలో ప్రభావముండును. ప్రాచీనమహర్షులు సూత్రభాషలో మాటలాడెడివారు. 'నెపోలియన్' శత్రువులపై దండెత్తుటకు పూర్వము తనసైనికులతో నెక్కువ మాటలాడెడివాడు కాడు. కొలది మాటలతో వారిహృదయమున జీవనము నింపువాడు. మహాత్మగాంధి కొలది మాటలలోనే యెంతటి శక్తి యుండెడిది? వాణియందు తేజస్సు పెరిగినకొలది తక్కువ మాటలాడవలసివచ్చును. కావున సత్యసంకల్పులు 'వైఖరీ వాణి' నుపయోగింపరు. ఇట పాఠకులు మనస్సులో చేయబడు హార్దికప్రార్థనాశక్తినికూడ నూహించియుందురు. వేదములం దెన్నియో ప్రార్థనలున్నవి. వాని ప్రయోజనము నియ్యదియే. వాకచిజపముకంటె ఉపాంశుజపము, దానికంటెను మానస

జపము వేయిరెట్లు ప్రభావము కలిగియుండునని మనువు చెప్పియున్నాడు.

కావున మనము ఇంపుగాను, అధికముగాను మాటలాడుటకుబదులు హృదయమునుండి సత్యతతోగూడిన మాటలు కొలదిగా మాటలాడుటవలననే వాణిశక్తి మనయనుభవమునకు వచ్చును. ఇటలీప్రజలు 'మేజిని' కలములో 'గారడియున్న' దందురు. భారతీయులు 'గాంధీజీమాటలతోనే లోకులపైగారడీ ప్రయోగింతురందురు. కాని యిట గారడి యేమియు లేదు. సత్యముచెప్పుట, అనుభవముననున్నది యున్నట్లు చెప్పుటయే. అదియే గారడి. వాణి-శక్తి గభీరతలో నున్నదికాని, మఱి యెక్కడను లేదని యభిప్రాయము.

అందువలన వాణిరూపధనుస్సును మనము మనవైపున కెంతయెక్కువలాగి 'వాక్కు' రూపబాణమును విడిచిన నది యంతదూరమువఱకు తనప్రభావమును కలిగించునని గుర్తింపవలయును.

## వేదోక్తమగు ధనువు

వాణిరూపధనువు రచననుగూడ పాఠకులు కొంత తెలిసికొనవలెను. ధనుర్దండము హృదయబలము. సత్యము చెప్పువానికి భయముండదు. సత్యముతో నిర్భయము కలిసియుండును.

'సత్యాన్నాస్తి భయం కించిత్'

హృదయమున సత్యము నిర్భయతయు నున్నపుడు హృదయమున బలమెక్కుడగును. హృదయపుదైవసంపదను

గణించుచు 'అభయం సత్త్వసంశుద్ధిః' యని శ్రీకృష్ణుడు ప్రారంభించియున్నాడు. ఈ హృదయబలరూప ధనుర్దండము నందే జిహ్వా-రూపనారి సంధింపబడియున్నది. దీనినుండి శబ్దములనెడి బాణములు విడువబడును. వింటినారినుండి బాణములు విడువబడునట్లు జిహ్వనుండిమాటలు వెలువడును. కేవలము నారి బాణములను దూరము పంపజాలదు. అది యొకధనుర్దండమునకు బంధింపబడును. అట్లే జిహ్వ స్వయముగా మాటలాడనేరదు. హృదయమున అభిప్రాయము, మాటలాడుకోరిక కలిగినమీదట నాలుక-జిహ్వ కదలును. నాలుక హృదయము నాశ్రయించును. అందువలననే హృదయమును ధనుర్దండముగా చెప్పిరి. హృదయముకూడ వాణికి అంగమని పాఠకులు తెలిసికొనియే యుందురు. అది వాణికి మధ్యమస్థానము. ధనుర్దండము, నారి రెండును సరిగా సంధింపబడినపుడే బాణములు విడువబడును. అట్లే హృదయబలము, జిహ్వయు కలిసినపుడే శబ్దములు పుట్టును. శబ్దమునగల యర్థమును హృదయము ప్రేరేపించును. ధ్వనిని జిహ్వ ప్రేరేపించును. ఈవిధముగ శబ్దరూపబాణము వెలువడును.

శబ్ద-బాణముయొక్క మొన యేమగును? లక్ష్యమును విద్ధమొనర్చునదియే కదా! ప్రాణవాహకములగు నాడులే-జ్ఞానతంతువులే బాణపుమొనలు. జ్ఞానతంతువులు-నేటి విజ్ఞానము ననుసరించి, శబ్దగ్రహణము (ఇంద్రియముల విషయగ్రహణము) జ్ఞానతంతువులతో నగునని మనమెఱుగుదుము. మనచే బంపబడిన శబ్దము ఇతరుల జ్ఞానతంతువులపై ప్రభావము కలిగించును. అప్పుడు వారికి తమకు జ్ఞానము కలుగుచున్నట్లు

తెలియును. ఇట్లు వక్తయొక్క జ్ఞానతంతువులప్రభావము శ్రోతలజ్ఞానతంతువులపై బడును. వక్త యెంతటివేదనతో శబ్దోచ్చారణ చేయునో యాశబ్దములు శ్రోతలో నంతటి వేదనను కలిగించును. అందువలననే శబ్దరూపబాణాగ్రములు ప్రాణనాడులనబడినవి. మన యుపనిషత్తులవిజ్ఞానము ననుసరించి యీవిషయమింకను స్పష్టమగుచున్నది. ఉపనిషత్తులలో మనస్సు సర్వవ్యాపకముగా నంగీకరింపబడినది. అట్లే ప్రాణము కూడ మనమేదేని యొకభావముతో మాటలాడుదుమేని మన శరీరగతప్రాణతరంగములు ఈ సర్వవ్యాపకప్రాణముద్వారమున శ్రోతృప్రాణమున జేరి యందును నట్టితరంగములనే కలిగించును. ఈవిధముగ మనశబ్దములతోబాటు పంపబడిన ప్రాణతరంగములు శ్రోతృప్రాణమున గ్రుచ్చుకొనును. ఈ ప్రాణతరంగములే మనబాణముల దంతములు అగ్రములు- అగును.

ఈ బాణాగ్రములను మనము తెలిసికొనినమీదట వీనిలో తీక్ష్ణత యెట్లు కలుగునో తెలిసికొనుట సులభమగును. బాణాగ్రములు బాగుగ గ్రుచ్చుకొనుటకు తగినతీక్ష్ణత యెట్లు కలుగును? లోహపుబాణములకొనలు అగ్నియందు తపింపజేసి వానిని విషమున ముంచియెత్తి తీక్ష్ణములు చేయుదురు. అది శత్రుశరీరమున గ్రుచ్చుకొని విషపూతములగుటచే శత్రువుల చావుకు హేతువులగును. కాని మన ధనుస్సుయొక్క బాణాగ్రములు 'తపసాఽభిదిగ్ధాః' తపస్సుతో తీక్ష్ణము లొనర్పబడును. వీనిలో తీక్ష్ణత తపస్సువలనకలుగును. తపస్సనగా కష్టసహనము. మనమెంత తపస్సుచేయుదుమో, మనచే

జెప్పబడుసత్యమునందును అంత తీవ్రభావావేశముద్భవించును. అదియే శ్రోతకు తీవ్రముగా గ్రుచ్చుకొనును. మన యీశాస్త్రమునని తరులకుకష్టము కలిగించుటకుబదులు మనమే కష్టము సహించిన తీక్ష్ణత యేర్పడును. మన మేసత్యమును ఇతరులకు చేర్పదలచితిమో-ఇతరులహృదయమును మార్చి యాసత్యమును స్వీకరించునట్లు జేయదలచితిమో యాసత్యము కొఱకు మనము కష్టములను సహించియుండిన మనము చెప్పినసత్యమునందు తీక్ష్ణత వచ్చియుండును. ఒకవస్తువునందు రాపిడివలన తీక్ష్ణత కలిగినట్లు కష్టసహనమువలన సత్యమునందు తీక్ష్ణత వచ్చును. అందువలన నేదేశము కొఱకెవరెక్కువ కష్టములను సహించిరో వారిశబ్దము లితరుల హృదయమున నెక్కువ గ్రుచ్చుకొని వారిని కదలించివేయుట మనము చూచుచున్నాము.

ఇట్టి ధనుస్సును నడుపువాడెవడు? దీనికి గతి యెట నుండి లభించును? ఇట 'దేవజూతైః' అని మంత్రమున వర్ణింపబడినది. బ్రాహ్మణుని హృదయముననుండు దేవ-దేవ భావములు-(అభయత, పవిత్రత, సత్యత - మున్నగుదేవభావములు) ధనుస్సునందు వేగము నుత్పన్నము చేయును. దేవజూతమనగా హృదయబలము. ఇదియే బాణ-ధనుస్సునకు-ముఖ్యవస్తువు. అందువలన హృదయబలమునే యీమంత్రమున ధనుస్సుగా చెప్పుట జరిగినది. నేటిభాషలో హృదయబలమనగా మనోబలము - సంకల్పబలము (Will Power) అందురు. హృదయబలమే ముఖ్యవాణి-లోపలివాణి - (మనోవాణి) దీనిని హృదయవాణి యనియు చెప్పవచ్చును. ఈ

హృదయవాణియే బ్రాహ్మణునకు ముఖ్యధనుస్సు. మిగిలిన జిహ్వ, వాక్కు, నాడులు మున్నగునవి యాధనుస్సున కంగములు. దీనికి గతి గలిగించునవి దేవతలు. ఈ దేవజూత-హృదయవాణిరూప ధనుస్సుతోనే బ్రాహ్మణుడు దేవపీయువులను-దేవనాశకులను-నశింపజేయును. -వారిహృదయములను మార్చును.

## ఈ ధనుస్సు పట్టుకొనుము.

సత్యాగ్రహుల కిదియేధనుస్సు. బ్రాహ్మణునకు 'అథర్వణశ్రుతి' ధనువుగా నుడివియున్నాడు. ఇట్టి హృదయవాణిని పలుకువారు-ఈశస్త్రముతో శత్రువును జయించువారు - తపస్వులు ఎల్లదేశములందును నెల్లకాలములందు నుందురు. ఈతేజస్వంతుల హృదయములనుండి వెలువడువాణి దేశమున క్రాంతి కలిగించును. ఈ మహాపురుషులవాణి సంకేతములను బొంది వేలకొలదిజనులు వారి యాజ్ఞలను పాలింప నడుములు బిగింతురు. ఈ వాణిరూపమహాస్త్రముముందు తుపాకులు, ఫిరంగులు నేపాటివి? వల్లభభాయివాణిని బార్డోలీ కర్షకు లాలకించిరి పర్వతనేనివీరయ్యచౌదరి పలుకును 'పెదనందిపాడు' ప్రజలు చెవియొగ్గి వినిరి. వారి వాణిలోనున్న తేజస్సే యట్టిది. దానిని విని పాలింపకుండుట ప్రజలకు సాధ్యముకాదు. విశాలసామ్రాజ్యమునకు సంబంధించిన ఆంగ్లేయుల సర్వాస్త్రములు నిష్ప్రయోజనములయ్యెను. గాంధీజీ వాణియొక్క బలముచేతనే 1921-22లో వేలాదిజనులు సంతోషముతో నెన్నియో కష్టములు సహించిరి. ఇదియొక్క వ్యక్తియొక్క హృదయ వాణిరూప దేవజూత-ధనుస్సుయొక్క ప్రభావమే.

మనమెల్లరము హృదయముననున్న యీ అస్త్రమును ప్రయోగింపగలిగిన నెంతటిమహత్కార్యమో సంపన్నము కాగలదు. మన మీ వేదోక్తమహాస్త్రమును సఫలప్రయోగము చేసి లోకమునకు జూపవలసియున్నది. ప్రపంచమొక నూతనాస్త్రమును చూడగలదు. మఱతుపాకులు, బాంబులు, విషవాయువులు మున్నగు మారణాస్త్రములకు భయపడి, ఈర్ష్యాద్వేషాదులకు లోనైయున్న యీ ప్రపంచము కొంతకుకొంత సుఖపడగలదు. మన మసత్యమును విడువలేమా? హృదయమును శుద్ధముచేసికొనలేమా? ఈమాత్రము చేయగలిగిన దేవజాత-దివ్యధనుస్సు సిద్ధము కాగలదు, దీని నెందుకు ధరింపరాదు? మనకు తుపాకులు లేవు-పిస్తోలులు లేవు-లేకపోనిండు - వానివలన నేమగును. భగవంతుడీదివ్యధనుస్సును మనకందఱకు ప్రసాదించియున్నాడుకదా? స్వయముగా తాను మనహృదయమందిరములలో దానిని నడుపుటకు సిద్ధముగానున్నాడు కదా?

'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేऽర్జున తిష్ఠతి'

హృదయవాసియగు నీదేవు డీయస్త్రమును ప్రేరేపించుటకు, ఇందు గతిని-జవమును గలిగించుటకు మనము చేయవలసిన దింతియే. మనము మనహృదయమును పూర్తిగ శుద్ధము చేసికొనవలెను. అందసత్యలేశ ముండరాదు. ఈర్ష్య, ద్వేషము, భయము హింసాభావ మినుమంతయు నుండరాదు. మనహృదయమునగల యీ మాలిన్యముల నెంతగా శుద్ధము చేసికొనిన నంతగా నీదేవుడు మనహృదయములందు వసించును. ఆ సత్యస్వరూపదేవు డీయస్త్రమునకు కావలసిన జవసత్వముల నొసంగును. ఈ ధనుస్సును దేవజాతము చేసికొనిన

మీదట బాణములను తీక్ష్ణమొనర్పవలసియుండును. బాణములు తీవ్రముగా వెడలినను పదునులేనినాడు నిష్ఫలములగును. కావున బాణములను తపోదిగ్ధములు చేయవలయును. తపమొనర్పవలెను. స్వాధీనత యనెడి మహత్సత్యమును బొందుటకు సర్వకష్టములను సహింప నుద్యుక్తులు కావలెను. మనతపస్సు ఎక్కువైనకొలది బాణములు తీక్ష్ణములగును. దేశవాసుల హృదయములందు స్వాధీనతాప్రకాశము వ్యాపింపదొడగును. శత్రువుల హృదయమునగల స్వార్థాంధకారము దూరమగును.

---

## ఈయస్త్రమమోఘము

"తీక్ష్ణేషవో, బ్రాహ్మణా హేతిమన్తో
యా మస్యన్తి శరవ్యాం న సా మృషా,
అనుహాయ తపసా మన్యునా చోత
దూరాదేవ భిన్దన్త్యేనమ్." ౯

హేతిమన్తః=హృద్బలరూపధనుస్సు గలవారు, తీక్ష్ణేషవః=తపోరూపతీక్ష్ణబాణములు గలవారునైన, బ్రాహ్మణాః=ఏబ్రాహ్మణులుకలరో, యాం శరవ్యాంఅస్యన్తి=ఏబాణసమూహమును విడిచెదరో, న సా మృషా=అదివ్యర్థముకాదు. తపసా ఉత మన్యునా చ=తపస్సుతో, మన్యువుతోను, అనుహాయ=వెంటబడియిట్లు, ఏనం=దేవపీయువును, దూరాత్ ఏవ=దూరమునుండియే భిన్దన్తి=భేదించును.

ఈ మంత్రమునచెప్పిన విశేషమేమన. హృదయవాణి రూపధనువును ధారణచేయు బ్రాహ్మణులు ఏబాణసమూహ మును శత్రువులపై ప్రయోగింతురో యాశరసమూహమెన్నడు వ్యర్థముకాదు. అది శత్రువును తప్పక పరాజితుంజేయును. ఇందు వ్యాసుడు 'అమోఘా అస్య వాగ్ భవతీతి' యనిచెప్పిన యమోఘతయే వర్ణింపబడినది. ఈవ్యాసుని వాక్యమునకు జనకమైన వేదవచనమందును మనకు శ్రద్ధకలుగదా! దీని యందు మనకు శ్రద్ధగలిగిన మనకు పెద్దబలమువచ్చును. మనలో సత్యనిష్ఠ యేర్పడుటకు మిక్కిలి వేగముప్భవించును. కారణమేమన : ఎవనికి తనయస్త్రము యొక్క యమోఘత యందు విశ్వాసముండునో యతడు దానిని ముక్కాలములం దును విడువడు. మనము పూర్ణమైన సత్యనిష్ఠయొక్క అదర్శ మును ఒక్కసారిపొందలేమనుట నిజమే. కాని శ్రద్ధతో గ్రహిం చిన యీవేదవచనము ఈమార్గమున నడచుమనకుప్రతిపదము నందును సహాయకమగును. మనలో నెంతగా సత్యనిష్ఠయుం డునో యంతగా బాణములు ప్రభావమును కలిగించును. కొంచెము సత్యనిష్ఠయు వ్యర్థము కాదనిభావము. ఇట్లు పూర్ణ సఫలత యొకసారి లభింపకున్నను క్రమముగా లభించుననుట నిస్సందిగ్ధము. కాని యది యీమార్గముననే లభించును. అవశ్యములభించును. వేదమీవిషయమునే మనకు బోధించు చున్నది. ఈవిధమున మనముచేసిన స్వల్పప్రయత్నముకూడ వ్యర్థముకాదు. గతించిన ఐరోపాయుద్ధమున నెన్నియో యస్త్ర శస్త్రములు వ్యర్థములైనవి. శత్రువులకేవిధమైన హానియు కలి గింపజాలకపోయినవి. ఎంతో ధననష్టము వాటిల్లినది. కాని సత్యమయవాణి నుండి వెలువడిన బాణమెన్నడును వ్యర్థము

కానేరదు. అది రామబాణమగును. రామబాణమిట దేవజ్ఞాత బాణమనదగును. పరమాత్మ ప్రేరిత బాణమని భావము. మన నిర్బలత కారణముగా మనమొక్కసారి యీ యస్త్రము మూలమున సఫలత బొందజాలక పోవచ్చును. కాని యీ యస్త్రముచేతనే మనశక్తిననుసరించి శీఘ్రముగానో యాలస్యముగానో మనకు సఫలత దొరకుట నిశ్చితము. ఇట్టి యస్త్రపుట మోఘతను మనము బాగుగ తెలిసికొనవలెను. దీనిని తెలిసికొనుటయందే యధికమాశ్రితమై యున్నది. ఈయస్త్రపుట మోఘతయందు విశ్వాసము లేనివాడు ఈదివ్యాస్త్రము గ్రహింప నెన్నడు నుద్యతుడుకాడు. ఉద్యతుడైనను మధ్యలో విడిచిపుచ్చును. కావున నిది యమోఘము. (న సా మృషా) ఇది చివరివఱకు చేర్చగలదు. మనమీయస్త్రమును పూర్తిగ లాగ గలిగిన బలము-సత్యనిష్ఠతయొక్క సామర్థ్యము గలవారమేని యది యొక్కసారియే సఫలతను గలిగింపగలదు. అను ఇట్టి యాలోచనను హృదయాంకితము చేసికొనవలెను. 'న సా మృషా' అను నీవేదవచనము మనలో జీర్ణింపవలెను.

ఈయస్త్ర మెందువలన అమోఘము? ఈయస్త్రముగల బ్రాహ్మణుడు తన తపస్సు, మన్యువు మూలమున తన శత్రువును వెంటాడి యతనిని భేదింపగలడు. బాహ్యమున హింసతో గూడిన యుద్ధమందును శత్రువును పూర్తిగ నణపదలచిన నాడతని వెంటాడవలసి వచ్చును. నడచికాని, వాహనము మూలమునగాని నతని వెంబడింపక తప్పదు. మనము రెండు కాళ్లతో వెంటాడునట్లు బ్రాహ్మణుడు తపస్సు, మన్యువునను

రెండు సాధనములతో తనవిరోధిని వెంబడించును. వీనితో విరోధి హృదయమున ప్రవేశించును. ఈవిధముగ తపము, మన్యువు రెండును మనల నీయస్త్రము మూలమున విరోధి హృదయమున జేర్చును. అందువలననే యీాయస్త్రమమోఘము.

గత మంత్రమున తపస్సు ఉల్లేఖింపబడినది. మన్యువు అనగా చెడుగును తొలగించుటకు నేర్పడు ఉత్కటేచ్ఛయని యర్థము. మన్యుపదమునకు సాధారణార్థము శ్రేష్ఠక్రోధము. ద్వేషభావములేని హితకామనతో కలుగు క్రోధము మన్యువనబడును. పరమాత్ముని క్రోధమిట్టిదియే. నిర్ద్వేషక్రోధమని భావము. నిజముగా ద్వేషభావము విడిచి యితరుల హృదయమునందలి అసత్యమును దొలగింప మనలో నుత్కటేచ్ఛ తీవ్రమైనకోరిక గలిగినచో దానికొఱకు ఎన్నికష్టములు సహింపవలసి వచ్చినను మనమందులకు సిద్ధమగుదుము. ఈకష్టసహనము రెండవవస్తువు. ఇదియే తపస్సు. మనకిది రెండవపాదము. రెండుపాదములు కలిసి పనిచేసినట్లు తపము, మన్యువునను నీరెండును మనలను విరోధి హృదయమున జేర్చును. కేవల తపస్సు మనలనెటకైన గొంపోవును. విరోధిహృదయముననే కాదు. మన్యువు వలనకూడ మనమటువైపే పోవుదుము. కేవల మన్యువు హృదయమును పట్టుకొనదు. విరోధికొఱకు కష్టము సహించిననాడే మనకతనిహృదయమున జేరుటకు మార్గమేర్పడును. చెడుగును తొలగించుటకు మనలో నెంత తీవ్రేచ్ఛకలుగునో, అందుకొఱకు ఎంతకష్టసహనశక్తి యేర్పడునో అంత త్వరగా మనము విరోధిహృదయమున స్థానమేర్పఱచుకొనగలము.

విరోధి యెంతదూరమున నున్నను తపము, మన్యువు నీరెండును విరోధియాత్మతో మనలను కలుపును. 'దూరాద్ అవభిన్దన్తి ఏనమ్.' ఈ యాంతరిక యుద్ధమున బాహ్యదూర మంతగా నడ్డురాదు. హృదయవాణీ రూపాస్త్రము సప్తసముద్రముల కవతలనున్న విరోధిని భేదింపగలదు. మన యస్త్రమునకు లక్ష్యము కాదగిన విషయము పరలోకముననున్నను తపము, మన్యువు ద్వారమున మనయాత్మ యాలోకమునకును చేరగలదు.

ఈయమోఘాస్త్రమును ప్రయోగింపదలచిన వ్యక్తియేమి చేయవలెను? అతడు తన హృదయమును శుద్ధము (సత్యమయము)చేసికొనవలెను. ఇది పూర్వమంత్రమున చెప్పబడినది. దీనివలన ఆయుధము సరిగా సిద్ధమగును. కాని, యీాయాయుధమును ఫలవంతముగా బ్రయోగింపదలచిన నింకను కొంత మనకు జేయవలసియున్నది. హృదయమును శుద్ధము చేసికొనుటయేకాక యందు నాశనముచేయదగిన అసత్యమునెడల మన్యువు - నుత్పన్నము చేసికొనవలెను. ఉత్కటేచ్ఛయునుండవలెను. మనవాణిని 'తీక్ష్ణమొనర్చుటకేకాక విరోధిహృదయమున చేరుటకును తపమొనర్పవలెను. మనహృదయమున, ఇతరహృద్గతమగు చెడుగును తొలగించుటకుగాను తీవ్రేచ్ఛనుంచుకొనుచు తపము ననుష్ఠింపవలెనని భావము.

మనము చేయవలసినదంతయు తపమే. వాణీరూపశస్త్రమును ప్రయోగించుటయన నెక్కువగా మాటలాడుటకాదు. వాణి-సంయమమావశ్యకము. కావున నధికముగా మాటలా

డుట ముందుగానే వదలవలెను. తదుపరి సంయమము. అప్పుడే హృదయమున నున్నది వాణియందు వచ్చును. తరువాత సత్యమే మనహృదయము నందుండునట్లు యత్నింపవలెను. ఇట్లు క్రమముగా పరమేశ్వరుని ఇచ్ఛకు విరుద్ధముగా నేయిచ్ఛయు మనహృదయమున కలుగకుండవలెను. ఇంతటి సంయమము వాణిలో నేర్పడవలెను. ఇట్టిసంయమము సంపాదించుటయే గొప్పతపము. ఈసంయమమువలననే వాణియందపారశక్తి యుద్భవించును.

వాణిసంయమముకొఱకు తపము చేయునట్లు, హృదయబలముకొఱకును తపమొనర్పవలెను. ఈవిధముగ మనచే సిద్ధము చేయబడిన హృదయమునందు స్వాభావికమున నెన్నడైన కొండొక యసత్యమును దొలగింప మన్యువేర్పడినచో మనమన్నికష్టములకు సిద్ధముగా నుందుము. కావున ఆయసత్యమవశ్యము నశించును. ఇందు సఫలత కలుగకుండుట యసంభవము.

వైదిక యుగమున భారతదేశపు మహర్షులు తపముచేసి, సత్యవంతులై వేదవాణితో సర్వవిధసఫలతలు పొందుచుండిరి. నేడు మనలోను మనమనస్సు మనహృదయవాణితో స్వాధీనతా మంత్రమును జపింపవలసివచ్చినచో, మనశరీరములు కష్టములనన్నిటిని సహింప సిద్ధమగునెడల ఈ యుగమునందును పరమాత్మ పూర్వమువలెనే సఫలత చేకూర్చును. ఇందుసందేహమునకు తావేలేదు.

# వైతహవ్యుల వినాశము

"యే సహస్రమరాజన్నాసన్ దశశతా ఉత
తే బ్రాహ్మణస్య గాం జగ్ధ్వా వైతహవ్యాః పరాభవన్."

యే సహస్రం అరాజన్=ఎవరు వేలకొలది జనులపై రాజ్యముచేసిరో, ఉత దశశతా ఆసన్ = స్వయముగా వందల కొలదిగా నుండిరో, తే వైతహవ్యాః=అవీతహవ్యులు, (రాష్ట్ర యజ్ఞమునకు చెందిన పన్ను అనెడి హవ్యమును తినువారు) ప్రభుత్వకర్మచారులు, బ్రాహ్మణస్య గాం జగ్ధ్వా= బ్రాహ్మణుని వాణిని తిని, పరాభవన్=పరాజితులైరి.

వైతహవ్యులు బహుసంఖ్యప్రజలపై రాజ్యముచేయుచుండెడివారు. వారిసంఖ్యయు నెక్కుడుగానే యుండెడిది. అయినను వారు రాజ్యపుపన్నును తమయనుభవమునకు ప్రోవుచేయుచుండిరి.ఇట్లు రాష్ట్రయజ్ఞమునకు జెందిన హవ్యమును తినుటయను గొప్పపాపము చేయుచుండిరి. కావున వారు నశించిరి.

ధనలోభులైన ప్రభుత్వాధికారులు ఈరాష్ట్రహవ్యమును తినుటలో శంకింపక లజ్జావిహీనులైనపుడు దేశవాసులగు బ్రాహ్మణులు దేశమున జరుగు అన్యాయము నెక్కువకాలము చూడలేకపోవుటచే నా యన్యాయమునకు విరుద్ధముగా తమ వాణి నుపయోగించిరి. అప్పుడావైతహవ్యులు ఈవాణిరూప గోవునుకూడ హత్యచేసిరి. ఇదియే వారి వినాశమునకు కారణమయ్యెను.

ఈపాప కారణమున వైతహవ్యులెట్లు నశించిరో పాఠకులింతవఱకు బాగుగ గ్రహించియే యుందురు. ఈవిషయమునే ముందు రానున్న రెండుమంత్రములలో వేదశబ్దముల మూలముననే వినుడు.

### చంపబడుచున్న బ్రాహ్మణవాణియే వారిని చంపును.

"గౌరేవ తాన్ హన్యమానా వైతహవ్యానవాతిరత్
యే కేసరప్రాబంధాయా శ్చరమాజా మపేచిరన్" ౧౨.

యే=ఏవైతహవ్యులు, కేసరప్రాబంధాయాః=సుఖ ప్రసారముకొఱకు బంధనరహితమగు నీవాణియొక్క, చరమాజాం=అంతిమ చేతావనినిగూడ, అపేచిరన్=తినిజీర్ణింప జేసికొనిరో దానినిగూడ వినలేదో, తాన్ వైతహవ్యాన్=ఆవైతహవ్యులను, హన్యమానా గౌః ఏవ = చంపబడుచున్న బ్రాహ్మణవాణియే, అవాతిరత్=పరాస్తముచేసెను-ఓడించెను.

బ్రాహ్మణుడు తనవాణికి సంబంధించిన తపోమయమగు నమోఘాస్త్రమును ప్రయోగించుటకు ముందు విరోధిని పలుమాఱు సావధానపఱచును. అంతిమప్రహారము చేయుటకు ముందుకూడ నట్లే యతనిని మేలుకొలుపును. అతడప్పుడు తనను సంబాళించుకొనినను అతనికి మేలుకలుగును. కాని, ఆ యంతిమ చేతావనినిగూడ మదోన్మత్తుడగు రాజు సరకుగొనని పక్షమున నతనిపై అస్త్రము ప్రయోగింపబడును. అప్పుడతడు వివశుడై లొంగిపోవలసిన వాడగును. నిన్న విననివాడు నేడు బ్రాహ్మణవాణియొక్క పూర్ణవిషయము నంగీకరింప వివ

శుడగును. అతడు తనపక్షమున బ్రాహ్మణవాణిని చంపియే యుండును. అందువలననే యతడపుడంతిమ (చరామాజాం) చేతావనినిగూడ లెక్కచేసియుండడు. కాని తదుపరి యోడి పోయి యతడు బ్రాహ్మణవాణి చెప్పిన ప్రతిదాని నంగీకరింప వలసివచ్చును. ఇట్లు చంపబడుచున్న యీవాణి యతనిని ఓడించును.

వైతహవ్యుడు దానియంతిమ చేతావనిని వినియున్న పక్షమున బాగుండెడిది. కాని వారావాణి విలువ నెఱుగరు. ఆ వాణి (కేసరప్రాబంధా) యెల్లపుడు నెల్లరి సుఖముకొఱకు ప్రవృత్తమగును. అది యెన్నడును బంధనమున బంధింప వీలుకానిది-ఎన్నడు పరాధీనముకాదు. (కే సుఖే సుఖనిమిత్తం సరాయ సరణాయ ప్రకర్షేణ అబంధా బంధన రహితా ఇతి=కేసరప్రాబంధా,)

(చరమా=అంతిమా, అజా = అజనమ్-చేష్టనమ్. ఇతి చరమాజా-అంతిమచేష్ట.)

## ప్ర జా ద్రో హి రా జు

"ఏకశతం తా జనతా యా భూమిర్ వ్యధూనుత
ప్రజాం హింసిత్వా బ్రాహ్మణీ మసంభవ్యం పరాభవన్" ౧౧

యా=దేనిని, భూమిః=భూమి, వ్యధూనుత=కంపింప జేసెనో, తాః జనతాః ఏకశతం = ఆజనసమూహములు వంద లాది, బ్రాహ్మణీం ప్రజాం హింసిత్వా=బ్రాహ్మణసంబంధమైన

ప్రజను హింసించి, వైతహవ్యులు, అసంభవ్యమ్=సంభావింప కయే, పరాభవన్=పరాజితులైరి.

సత్యమున నారూఢుడైయున్న రాజుయొక్క యాజ్ఞలను ప్రజలు పాలింపకుండుటచే రాజద్రోహులగుదురు. ఇట్లే సత్య పరాయణులగు ప్రజలమతమునకు విరుద్ధముగా శాసనమొన ర్చురాజు ప్రజాద్రోహియగును. అట్టిరాజు ప్రజను తనప్రజగా చేసికొనజాలడు. ప్రజయు తామారాజునకు చెందినవారుగా నెంచరు. తమ్ము రక్షించునాయకుని-బ్రాహ్మణునికి చెందిన వారుగా నెంచును. అట్టిప్రజను హింసించి వైతహవ్యులు తమ్ముతాము ప్రజాద్రోహులుగా చేసికొందురు. అందువలనవారు వందలాదిగానున్నను భూమి వారిని కంపితులనుజేయును. అనగా ప్రజలకు మాతయగు భూమియందు భయంకరక్రాంతి యేర్పడును. అందు వైతహవ్యులు పరాజితులగుదురు. వైత హవ్యుల బాహ్యశక్తి ప్రబలమై తోచును. వారు ఓడిపోవుదురని యెవ్వరు నూహింపజాలరు. కాని బ్రాహ్మణుని గొప్పతపస్సు ముందు వారు సులభముగా నోడిపోవుదురు. సాధారణజను లాశ్చర్యపడుదురు. అందువలననే యీమంత్రమున 'అసం భవ్యమ్' పదము ప్రయోగింపబడినది.

## దేవపీయువు – దేవబంధువు

"దేవపీయు శ్చరతి మర్త్యేషు<br>
గరగీర్ణో భవత్యస్థి భూయాన్<br>
యో బ్రాహ్మణం దేవబంధుం హినస్తి<br>
న స పితృయాణ మప్యేతి లోకమ్." ౧౪

దేవపీయుః = దైవీభావమును ద్వేషించు మనుజుడు, మర్త్యేషు=మనుష్యులలో, గరగీర్ణః చరతి=విషము త్రాగిన వాని వలె చరించును. అస్థిభూయాన్ భవతి=అస్థిపంజరమువలె నగును. యః=అట్టి యేపురుషుడు, దేవబంధుం బ్రాహ్మణం హినస్తి=దైవభావమును పోషించు బ్రాహ్మణుని హింసించునో, సఃపితృయాణంలోకం అపినఏతి=వాడు పితృయాణలోకమును గూడ పొందడు.

బ్రాహ్మణుడు 'దేవబంధుః' అగును. ప్రజలను పీడించు రాజు దేవపీయువగును. అట్టిబ్రాహ్మణుడు ఆరాజును సులభముగా నోడించుననుటలో నాశ్చర్యమేమి? ప్రపంచమున దేవునకు విరోధముగా నెవడు నిలువగలడు? దేవబంధువగుటవలన బ్రాహ్మణుని హృదయమున దేవజ్ఞాతమేర్పడును. దానితోబాటు గొప్పదేవబలము సంచారితమగును. ఇట్లది యమోఘాస్త్రమువలె నుపయోగించును. మఱియొకవంక దేవపీయువుని హృదయమున నింద్రుడు అగ్ని జ్వలింపజేయును. కావున దేవబంధువేల జయింపడు? దేవబంధువును విరోధించినందు వలన నతనికి కలుగు దుర్దశలీమంత్రమున వర్ణింపబడినవి.

ప్రపంచమున మానవునకు రెండుమార్గములు ప్రసిద్ధములు. (1) దేవయానము, (2) పితృయానము వైదికసాహిత్యమున వీనివర్ణన మిక్కిలిగా చూడనగును. వీనిని తెలిసికొనుటకు పాఠకు లీక్రింది వర్గీకరణమును పరిశీలింపుడు.

| దేవయానము | పితృయానము |
|---|---|
| 1. అపవర్గము<br>ఆధ్యాత్మికోన్నతి | 1. భోగము<br>భౌతికోన్నతి. |
| 2. బ్రహ్మచర్యముతో<br>ఆత్మతేజస్సును పెంచుట | 2. సంయమముతో<br>సంతానముగనుట |
| 3. గభీరత-లోతు. | 3. విస్తారము. |

ఈ రెండు మార్గములు స్వాభావికములు. దేవయానము పితృయానము కంటె నున్నత మార్గమైనను పితృయాన మస్వాభావికము కాదు. జీవుడు స్వాభావికముగ భోగమువంకకు బోవును. క్రమముగా నద్దాని తుచ్ఛతను గుర్తించి స్వభావముగ నపవర్గమువంకకు మరలును. ఈ మంత్రమున దేవపియువు పితృయానలోకమును గూడ బొందజాలడని చెప్పబడినది. అతడు భోజనమున కవశ్యకమగు సామాన్య నియమములను గూడ పాటింపక భోగము నందధికముగా నాసక్తుడగును. కావున నతని భోజనము భోగ్యపదార్థమయము కాక విషమయ మగును. అందువలన నతనికి శారీరికోన్నతియు కలుగదు. ఈ విషయమును ప్రకటించుటకే మంత్రమున 'అస్థిభూయాన్' పదము ప్రయోగింపబడినది. విషమువలన శరీరసారము, సత్వము, శ్రేష్ఠభాగమంతయు చహించిపోవును. అతని శరీరమున ఎముకలుమాత్రము మిగిలియుండును. ఒకమాటు రవీంద్రనాధ ఠాకుర్ పాశ్చాత్యసభ్యత ననుకరించు జపాను దేశమునకు భారతదేశపు సందేశమును వినిపించుచు నిట్టి యుపమానమునే యిచ్చియున్నాడు.

'తన సంస్కృతి, మానవత, న్యాయము, ధర్మము మున్నగు సారమైనవస్తువులను బోగొట్టుకొని సంపాదించిన ధనము నిర్జీవమగును. ఎముకలప్రోవగును. రసము, రక్తము శుక్రము, తేజస్సు మున్నగు వానిని నశింపజేసి శరీరమున ఎముకలను వృద్ధిజేయును.' అని యతడుచెప్పెను.

దేవపీయువున కీదశయేల కలుగును? అతడు దైవనియమములను-దేవతలను హింసించును. క్రియాత్మకరూపమున వీనికి విరోధముగా నతడు నిలుచును. ఈభావమును ప్రదర్శించుటకే యీమంత్రమున (దేవబంధుం బ్రాహ్మణం హినస్తి) 'దేవబంధువైన బ్రాహ్మణుని హింసించున'ని చెప్పబడినది. అతడు దేవయాన మార్గమున, నడవకున్నను హానిలేదు. కాని యతడు దేవయానమును విరోధింపక పితృయానమార్గమున నడచినను అంతగా హానియేమియునుండదు. కాని యతడు దేవయానమును విరోధించును. అతడు దేవత కాకపోవుటయే కాదు దేవతలను హింసించి 'దేవపీయువు' పగును. కావుననే యతని కభీష్టమగు పితృయానముకూడ సిద్ధింపదు. అతడు భోగముల ననుభవింపవచ్చు. కాని యాభోగములు దైవనియమముల నుల్లఘింపకున్న బాగుండును. అనగా నతడు దేవబంధువు కాలేకపోయినను దేవపీయువు కాకున్నచాలును. వీరిరువురికిమధ్య పితృబంధువును మనము కల్పింపవచ్చును. ఈ ముగ్వురి లక్షణముల నిట్లు తెలిసికొనవచ్చును.

జగత్తున దేవునికార్యము నెఱవేర్చువాడు, ఋతనామక దేవుని నియమములను పూర్ణముగ పాటించువాడు; వానితో తన్ను బంధించుకొని దేవయానమార్గమున నడచువాడు దేవబంధువనబడును.

దేవుని నియమముల నుల్లంఘింపక తనను పితృలోక నియమములతో బంధించుకొని పితృయానమార్గమున నడచు వాడు పితృబంధువనబడును.

దేవనియమముల నుల్లంఘించి పితృయానమార్గమున నడవగోరును. కావున నతడు పితృయానమార్గమునను నడవజాలడు. అట్టివాడు దేవపీయువనబడును.

## బాధింపబడు బ్రాహ్మణులెట్టి భావమున నుందురు?

"అగ్నిర్ వై నః పదవాయః సోమో దాయాద ఉచ్యతే,
హన్తాభిశస్తేన్ద్ర స్తథా తద్ వేధసో విదుః". ౧౫

అగ్నిః వై నః పదవాయః = అగ్నిరూపప్రభువు నిశ్చయముగా మనకు పథప్రదర్శకుడు, (పదం ప్రాప్తవ్యస్థానం, వావయతి గమయతీతి పదవాయః) సోమః దాయాదః ఉచ్యతే= సోమరూప ప్రభువు మనకు దాయాదుడనబడును. ఇన్ద్రః అభిశస్తా హన్తా=ఇన్ద్రరూపప్రభువు హింసనుండి మనలను రక్షించువాడు, తత్ తథా వేధసః విదుః=అది యట్లే జ్ఞానులు అనుభవించుచుందురు.

దేవబంధువులగు మానవులు రాజుయొక్క ప్రబలశక్తికి కూడ నేల భయపడరు? ఘోరములైన కష్టములకు గురియయ్యు వారేల విచలితులుకారు? వారు దుఃఖములను, బాధలను, దారిద్ర్యమును, కారాగారవాసమును, మృత్యువును అన్నిటిని వారేల యాహ్వానింతురు? వీనిని ప్రసన్నతతో వారేల యనుభవింతురు? వీని యన్నింటి రహస్య మీమంత్రమున వర్ణించిన వారి విశ్వాసమే. భగవంతుడు అగ్ని, సోమ, ఇంద్ర రూపములతో వారికి సహాయకుడగుచున్నట్లు వారికి కనబడు

చుండును. ఇట్టి విశ్వాసమున కొంతభాగము మనకుగూడ భగవంతుడు ప్రసాదించుగాక !

## ఉ ప స ం హా ర ము

"ఇషురివ దిగ్ధా నృపతే! పృదాకూరివ గోపతే !

సా బ్రాహ్మణస్యేషుర్ ఘోరా తయా విధ్యతి పీయతః" ౧౬

నృపతే!=ఓరాజా! దిగ్ధాః ఇషుః ఇవ = బ్రాహ్మణవాణి విషదిగ్ధ బాణమువలె పనిచేయును, గోపతే ! = ఓ గోవును పాలించు రాజా!, పృదాకూః ఇవ=బ్రాహ్మణవాణి సర్పిణివలె నగును, సా బ్రాహ్మణస్య ఘోరా ఇషుః తయా పీయతః విధ్యతి=తనవాణియే బ్రాహ్మణునకు గొప్ప ఆయుధము. దాని తోనే దేవహింసకులను వేధించును.

అంతమున రాజును 'నృపతే! గోపతే' అను రెండు విశేషణములతో సంబోధించి వేదమీవిషయము నుపసంహ రించుచున్నది. రాజు మనుష్యులను పాలించువాడు కావలెను. గోవును పాలించుటకతడు గోపతియగును. గోపదముచే చెప్ప బడు పృథివి, గోవు, వాణి-విశేషముగా బ్రాహ్మణవాణి వీని నన్నింటిని, ఇట్లే యింకను రక్షణీయములగువానిని రక్షించు టకు రాజు అవశ్యకమగును. కాని రాజు బ్రాహ్మణులను హింసించును. బ్రాహ్మణవాణిని హింసించును. కావున నతని నంతమున 'గోపతే! నృపతే!' అనుపదములతో సంబోధించి 'నీవు గోవులను-ప్రజలను రక్షించుమ'ని మంత్రమున ప్రబో ధించుట విశేషమని యెంచనగును.

స మా ప్త ము.